భారతప్రశస్తి




స్త్రీల ఆరోగ్య భాగ్యానికి




ఆరోగ్య సౌభాగ్యములకు
కేసరి రత్నత్రయము

# లోధ్ర

గర్భాశయ రోగ నివారిణి

ఈ ఔషధము ఉత్తమోత్తమము, నికరమయినదిగా యాభైఅయిదు సంవత్సరములుగా ప్రఖ్యాతిగాంచినది. స్త్రీల ప్రత్యేకమైన, ఋతు సంబంధమైన జబ్బులు, హిస్టీరియా, నిద్రలేమి, మలబద్ధకము. తలనొప్పి, వెన్నునొప్పి మొదలగు వాటికిది వరప్రసాదము.

# అమృత

రక్తశుద్ధి ద్రావకము

నిరుత్సాహుల నరములను బలపరచగల శ్రేష్ఠమయిన టానిక్. రక్తహీనత, అజీర్ణము మొదలగు జబ్బులయందిది నమ్మకముగ పనిచేయును.

# అరా

సర్వజ్వర నివారిణి

ఇది మలేరియా, ఇన్‌ఫ్లుయంజా మొదలగు జ్వరములను, జ్వరగడ్డలను కుదుర్చును.

పూర్తి వివరములకు:

## కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు-14.

తెలుగుజిల్లాలకు, ఒరిస్సాకు, నైజాముకు ఏజంట్లు:
శీతారాం జనరల్ స్టోర్సు, విజయవాడ. బరంపురం, సికిందరాబాద్.

# మీ క్రొత్త నాణ్యాలను గురించి తెలుసుకొనండి




ఇప్పటిలో మీరు మీడబ్బును రూపాయలు, అణాలు, పైసాలని లెక్క పెట్టుతున్నారు. మీ సౌలభ్యం కొరకనే భారత ప్రభుత్వంవారు 1957-వ సం॥ ఏప్రిల్ 1-వ తేదీ లగాయతు దశమాంశ నాణ్యాలను ప్రవేశ పెట్టాలని తీర్మానించుకున్నారు.

ఈ క్రొత్త నాణ్యపద్ధతి ఛొప్పున మీ రూపాయికి 100 నయా పైసాల విలువగలదు. మొత్తం ఏడు రకాల నాణ్యాలు వాడుకలో ఉంటాయి :—

100 నయా పైసలు ... (ఒక రూపాయి)
50 నయా పైసలు ... (అర్ధ రూపాయి)
25 నయా పైసలు ... (కాలు రూపాయి)
10 నయా పైసలు ... (రూపాయిలో 1/10 భాగము)
5 నయా పైసలు ... (రూపాయిలో 1/20 భాగము)
2 నయా పైసలు ... (రూపాయిలో 1/50 భాగము)
1 నయా పైసా ... (రూపాయిలో 1/100 భాగము)

## గమనింపదగిన విషయాలు

- రూపాయి చెలామణీ నాణ్యంగా వుంటుంది. దాని విలువలో లాభ నష్టము లేవీ ఉండవు.
- పాత నాణ్య పద్ధతినుండి కొత్త పద్ధతికి మార్పు సందర్భంలో, ఈ మార్పు సావకాశంగా, క్రమక్రమంగానే జరుగుతుంది. కనీసం మూడు సం॥ వరకైనా పాత నాణ్యాలూ, కొత్త నాణ్యాలూ చెలామణీలో వుంటాయి.
- ఈ మూడు సం॥ కాలంలో లావాదేవీలు పాతనాణ్యాలతో నైనా, కొత్త నాణ్యాలతోనైనా లేక ఈ రెండు పద్ధతులలోనూ జరుగుతూ వుంటాయి.




Grihalakshmi, August 1956.

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను సంపాదించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.
వ్యవస్థాపకులు
డాక్టరు. కే. యస్. కేసరి
ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య
సంపుటము ౨౮] ఆగస్టు 1956 [సంచిక ౫

# విషయసూచిక

—(౦)—



ముఖచిత్రం : By Courtesy of "Lokavani"






జయజయ గృహలక్ష్మీ స్త్రీ సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతోమా!
జయజయ లలనా రత్నము! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# ఆగష్టు 15

ఆగష్టునెల అంటే యీ నాటికింకా ఒళ్లు పులకరిస్తుంటుంది. స్వాతంత్ర్య సమరం అంతకుముందెంత కాలమునుండి జరుగుతున్నా చివరసారి ఆంగ్లేయ ప్రభుత్వాన్ని తరలి పోవలసినదిగా హెచ్చరించిన ఈనెల. అంతేకాదు జాతీయ బలాన్ని సమీకరించి గాంధీజీ నాయకత్వము క్రింద స్వాతంత్ర్య సంపాదనో లేక ప్రాణముల నర్పించడమో ననే నినాదంతో అతిరథ మహారథులతోసహా స్త్రీలు, పురుషులు, ముసలి, ముతక, విద్యార్థులు సమరరంగంలోకి దిగిన నెల యిది.

వీరోచితంగా పోరాడుతూ అనేకమంది జాతీయ వీరాధి వీరులు చెరసాలల పాలయ్యారు. కొంతమంది చిత్రవధ కావించబడ్డారు. మరి కొంతమంది అజ్ఞాత వాసంలో ఊహాతీతమయిన కష్టాలకు గురియయినారు. మరికొందరు దేశ స్వాతంత్ర్యము నుద్దేశించి తమ ప్రాణములను సయితం అర్పించారు.

జాతీయోద్యమం, స్వాతంత్ర్య సమరం ప్రారంభంనుండి ఆగష్టు ఉద్యమందాక జాతీయ శ్రేయస్సు నుద్దేశించి జరిగిన వీరోచితమయిన పోరాటము, అఖండ త్యాగాలు

యీ నాటి స్వాతంత్ర్య సిద్ధికి కారణము. ముఖ్యంగా విశిష్టమైన గాంధీజీ నాయకత్వము మనకు స్వాతంత్ర్యమునేకాక రక్తపాతములేని అహింసాయుత సమరము ప్రపంచ వ్యాప్తమయిన సానుభూతి సద్భావములను, కీర్తి ప్రతిష్టలను సమకూర్చినవి.

గాంధీజీ బోధనలు, ప్రణాళికలు ప్రజల నైతిక స్థాయి పెంపును, గ్రామీణ ప్రజల సౌభాగ్య విస్తరణను ప్రోత్సహించినవి. సహజమైన మానవశక్తితో స్వీయ సౌభాగ్యాన్ని తీర్చి దిద్దుకోడాని కనువైన మార్గములను బోధించిన వారు పూజ్య బాపూజీ. ఆయన బోధనలు మానవునిలో ఆత్మ శక్తిని పూరిస్తవి. సన్మార్గంలో నడుపుతూ జాతీయ శాంతి సౌభాగ్యాలనేకాక అంతర్జాతీయ సమరస సద్భావాలను. శాంతి సౌభాగ్యాలను పూరించునట్టివి.

ఈ నాడు మనం జరుపుకునే స్వాతంత్ర్యోత్సవ సందర్భమున దేశ స్వాతంత్ర్యము కొరకు విధివిరామము లేకుండా పోరాడి త్యాగాలనుచేసిన జాతీయవీరులను స్మరించాలి. వారి జీవితాలను ఆదర్శంగా తీసికొని విశాల దృష్టితో ప్రతిమొక్కరు జాతీయ శ్రేయస్సుకు తోడ్పడాలి. ఉత్సవాలు, ఊరేగింపులు, బహిరంగ సభలతో బాటు గాంధీజీ నిర్మాణ కార్యక్రమం యథేచ్ఛగా సాగిననాడు మనం సాధించే విజయాలు ఘనమైనవి కాగలవు.

భారత ప్రధాని పండిత నెహ్రూ నాయకత్వము క్రింద మన దేశం, మనం ఏకోన్ముఖంగా అభ్యుదయకరమైన అభివృద్ధిని సాధించి జాతీయ, అంతర్జాతీయ రంగాలలో పేరు ప్రతిష్టలను సంపాదించుకోవాలి!

## కృష్ణ, గోదావరి నదుల వరదలు

కృష్ణ, గోదావరినదుల వరదలు సాధారణమయినా యీ సంవత్సరము వరదలు అనేక వేల యకరాల పైరుపంటలను నాశనంచేయడం, అనేక గ్రామాలు జలమయమై వేలాది ప్రజలను నిరాశ్రయులుగా జేయడం చాల విచారకరము.

కృష్ణ, గోదావరిలాంటి జీవనదులు ప్రజల జీవితావసరాలకు ఎంత అత్యావసరమో తరచుగా ప్రజలనవి అంత కల్లోలపరచి నష్టపరచుచుండుటను అరికట్టవలసిన బాధ్యత ప్రభుత్వముమీద ఎంతైనాకలదు. వరదలనుండి శాశ్వతమైన రక్షణ ఏర్పడవలసియున్నది.

## కృష్ణ, గోదావరినదుల వరదలు

ప్రకృతి సంపదలో భాగమైన నదీజలాలు ప్రజల భోగభాగ్యాల పెంపుదలకు అత్యధికంగా వినియోగపడి వాని వరదలనుండి పదిలమైన రక్షణకు మానవశక్తి సామర్థ్యాలు, ఆర్థికవసతులు, తెలివితేటలు వినియోగపడిననాడు సాధ్యముకానిదేమి యుండదు.

వరదలవల్ల నష్ట, కష్టాలకు గురియయిన ప్రజానీకానికి మా సానుభూతి తెలియజేస్తూ, లభించిన అనధికార, అధికార సహాయవసతులు క్రమంగా సాధారణ పరిస్థితుల నెలకొల్పగలవని ఆశిస్తున్నాము.

---

(400-వ పేజి తరువాయి)

జిక్కి తపియించు దీనుండ! చిక్కుఁబాపి
రక్షణముసేయుమయ్య! శ్రీరామచంద్ర!

౩౯

శృంగార రసములు బంగార సీతతో
మించు వేడ్కతో, విహరించినావు.
శివధనుర్భంగంబుఁ జేసెడివేళలో
వీరరసంబు, గుప్పించినావు.
కాకాసురునియందు, కారుణ్యరసమును
చిలికించి, వాని రక్షించినావు.
అంబుధిలో, పర్వతాళిని దేలించి
యద్భుతంబునుజూపి యలరినావు
శూర్పణఖయందు హాస్యంబు జూపినావు
పరులకాంతలయందు, భీభత్సరసము
రావణాసురవధయందు రౌద్రరసము
శాంతరసమూ, మునీంద్రుల పొంతఁజూపి
భయము బాడసూపితివి, ప్రతిపక్షులకును
రామ! శ్రీరామ! రక్షింపు! రామచంద్ర!

౪౦

తల్లి దండ్రినాకు ధరణిలో రాముండు
భ్రాత నాకు, ధరణిజాత విభుఁడు
సఖుఁడు నాకు రామచంద్రుండు; సర్వస్వ
మరయ రాముఁడతని నాశ్రయింతు.

౪౦ (a)

ఇష్టదైవమతఁడె, కష్టంబులను బాపు
సులభదైవమతఁడె, చూడవేఱు
దైవమెఱుఁగనేను—దయతోడ రాముండు
రక్షసేయ నన్ను రక్తితోడ.

(సశేషము)



# తెల్లరోజా!

రచయిత్రి :
ఇన్ గే షోల్

అనుసరణ :
డాక్టరు వి. ఎస్. శర్మ

## రెండో భాగం

### 1

యుద్ధం. ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది జర్మనీ పోలండు దేశాలమధ్య. కారణం అంత పెద్దది కాదు. ఆ మొదటి రోజుల్లోనే పెద్దలు కలుపుగోలుతనంతో సహాయానికి వచ్చివుంటే ఆ యుద్ధం రెండు మూడు వారాల్లోనే పూర్తి అయివుండేది. ఆ రెండు దేశాలమధ్య రేకెత్తిపోతూవున్న మనస్పర్థలూ వగైరాలూ మాయమై వుండేవి. కాని అలాంటి పెద్దలు ఆ కాలంలో వుంటేగా! అలావున్నా ధైర్యం చేసి, అవసరంవుంటే త్యాగం చేయటానికి సిద్ధంగావుండి ఆ రోజుల నాటి రాజకీయ సమస్యలను పరిష్కరించటానికి ముందంజ వేస్తేగా! హిట్లరుకు ఇదంతా తెలుసు. అతన్ని యుద్ధరంగానికి దించేసిన నాజీ నాయకులకూ చక్కగా తెలుసు. వాళ్ల దగ్గర వజ్రాయుధం వుందనీ, దానిచేత లోకాన్నంతా-ముఖ్యంగా అయిరోపా ఖండానంతా గగ్గోలు పరచవచ్చుననీ నాజీలు అనుకున్నారు. ఆ పనిని సాధించటానికి వాళ్లకు తట్టిన సాధనోపాయాలన్నిటినీ తటపటాయించక వుపయోగించారు. లోకం అసమర్థుల చేతుల్లోపడి చెడిపోతూవున్నదన్నారు. అంచేత లోక సంస్కృతీ తారుమారై పోతుందని ప్రచారం చేయటానికి ఆరంభించారు. ఇలాటి ఆయోమయావస్థలని పాశ్చాత్యపు ప్రపంచం పూర్వ కాలంలో అనేక సార్లు ఎదుర్కొనాలసి వచ్చింది. ఆ సమయాన జర్మను దేశమే ఈ పాశ్చాత్య దేశాలకి ఒక దరీదాపుని చూపి, వాటికీర్తి ప్రతిష్ఠలను రక్షించింది. ఇరవైయ్యో శతాబ్దంలో ఇలాటి అవస్థే ఈ ఖండానికి దాపరించింది. భగవానునికి ఈ సంగతి తెలిసే నాజీలని తగినసమయానికి సృష్టించాడు. నాజీ ఉద్యమం అంచేత ఒక్క రాజకీయ సమస్యలని మాత్రం తేల్చటానికి నెలకొల్పబడలేదు. ఒక ఆర్థిక సమస్యలని పరిష్కరించటానికి స్థాపింపబడలేదు. మానవుని పరిణామానికి సంబంధించిన అన్ని సమస్యలను విశాల దృష్టితో అవగాహనం చేసుకొని, వాటిని నిర్భయంగా తేల్చటానికే నాజీ ఉద్యమం ప్రారంభింపబడినదని నాజీలు [illegible]గడగట్టి భేరీ కాదాండద ఢాండ ఢాండ!! నినాదాలని అహోరాత్రాలు చేయసాగిరి. వాళ్లది ప్రభుత్వం. ఏ ప్రచారం చేయాలన్నా దానికి సంబంధించిన తతంగామంతా సునాయంగా, తూ. చా. తప్పకుండా నెరవేర్చటానికి వాళ్ల కదురూ బెదురూ అనేది వుంటేగా!.........

దీన్నంతా పూతగా సుంచుకొనే హిట్లరు యుద్ధయాత్రని ప్రారంభించాడు. అతను అంత అమాంతంగా ఆ పనిని ఆరంభిస్తాడని ఎవళ్లూ అనుకొన్నవాళ్లు కారు, ఆ ఎత్తు రాక్షసి ఎత్తు అనే చెప్పాలి. ఆ ఎత్తుని ఆపటానికి ఇటు తూర్పు ప్రాంతాలవారికి, అటు పశ్చిమ దేశాలవారికి చేతకాకపోయింది. ఆ యుద్ధాన్నే బ్లిట్స్ యుద్ధమని అంటారు. మెరుపుకే మల్లే దోవలో ఎదురైన గ్రామాలమీద పట్నవాసాలమీద అమాంతంగా పడటం, అక్కడి ఆబాల గోపాలాన్ని కంగారుపరచటం... దాంతో పరదేశాలవారు నిశ్చేష్టులయ్యారు. అంతేనా? హిట్లరు అదుపాజ్ఞల్లోనుండి పోవాలసి వచ్చింది. అలాటి దుర్భరావస్థలో ప్రజాకోటి ఎదుర్కొనాలసివచ్చిన అష్టకష్టాలని ఇక్కడ వివరిస్తూ పాఠకులను ఎందుకు కష్టపెట్టాలి?... ఇలా కష్ట సాగరంలో మునిగి తేలుతూవున్నవారు ఒక్క పరాయి దేశాలవారే కాదు, జర్మను దేశీయులూ ఇలాటి కష్ట పరంపరల్లో వుక్కిరి బిక్కిరి అయిపోవాలసి వచ్చింది......

జయం తమదేనని జర్మనులు ప్రారంభంలో భ్రాంతిలో పడ్డారు. ఇలా ఆ జనాన్ని మాయ

మార్గాన దించటానికి మతాచార్యులు ఆ రోజుల్లో
చేసిన రాద్ధాంత సిద్ధాంతాన్ని ఒకసారి స్మరిస్తే మనకే
ఆశ్చర్యమవుతుందని చెప్పడంలో కూడా అతిశయోక్తి
ఏ మాత్రమూ వుండదు.......

మతాచార్యులకి కావాలసింది జనాంగమంతా తమ
కట్టుబాట్లలో వుండాలనేగా! ఆ పనిని సాధించటానికి
ఎలాంటి అసభ్యకరమైన దానిని చేయటానికి వెనుకంజ
వేసేవారు కాదు......ఇంత వరకూ హిట్లరు రాక్షస
కృత్యాల్ని ప్రతిఘటిస్తూవున్న ఈ మహనీయులే
అతని వెనుకనే వుత్సాహంతో నడుస్తూ అతను అన్న
దానికంతా ప్రక్కతాళం వేయసాగారు. బైబిలు గ్రం
థాన్నే ఈ కార్యసాధనకు నిరభ్యంతరంగా వుపయో
గించటానికి సాహసించారని చెప్పితేచాలు - ఆ
రోజుల్లో మత ప్రచారం ఏయే మార్గాల్లో సలుప
బడుతు వున్నదో గ్రాహ్యం చేసుకొనటానికి......
ఆ యుద్ధం క్రైస్తవ సిద్ధాంతాల్ని నిలువబెట్టడానికే
చేయబడుతూవున్నదని సమర్థించటానికి ఈ మతా
చార్యులు అవలంబించిన పద్ధతుల చర్చించటం అన
వసరం.......

హిట్లరు పద్ధతులను, తద్వారా యుద్ధ
జ్వాలల్ని ఆపటానికి ప్రజలు చేస్తూవున్న ప్రచారం
క్రీస్తు దేవుని సేవకే కళంకాన్ని తెచ్చిపెట్టటమని
ప్రతిరోజూ చర్చిలలో బోధించసాగారు. అలా పని
చేస్తూవున్న వారిని చెండాటటానికి అవలంబించాలసిన
సాధనోపాయాలని నిర్భయంగా వుపయోగించారు.
పుస్తకాల్ని వ్రాశారు. కరపత్రాల్ని ఈ ప్రచారం
కోసం తయారుచేసి ఇంటింటా పంచిపెట్టారు. జర్మను
సైనికులు పనిచేస్తూవున్న యుద్ధరంగాల్లో, సైనికులు
చేస్తున్న సేవ క్రీస్తు సేవ అనీ, ఆ సేవలో ప్రాణాల్ని
కోల్పోయారా స్వర్గ సుఖాన్ని తనివితీరా అనుభవించ
గలరనీ వాళ్లకు అస్తమానమూ వుపన్యాసాలీయ
సాగారు.......ప్రతి చోటా మంత్రులూ ఇతర
ప్రజాప్రతినిధులూ జర్మను ప్రజలని తమ వలలో వేసు
కొనడానికి చేసిన పద్ధతుల్ని వింటేనా...... మిలిటరీ
పనికి ఆ కాలాన కావాలసింది సైనికదళం. దేశంలో
వున్న దళాలన్నీ యుద్ధరంగాల్లో వున్నాయి. అవి
ఎప్పుడు మాత్రం దేశానికి తిరిగివస్తాయో? ఆ సంగతి
ఎవరికి తెలుసు? అసలు ప్రాణాలతో తిరిగి వస్తేగా?
...కళాశాలలలో చదువుతూవున్న విద్యార్థులూ,
విద్యార్థినులూ సైనిక దళాలలో చేరాలనీ ప్రచారం
ఎక్కువ కాసాగింది. దేశాన్ని కాపాడుకొనటానికి
చదువుల్ని కొంతకాలం ఆపివేసినా తప్పేమి లేదని
విద్యామంత్రులు ప్రతి రాష్ట్రంలోను, యూనివర్సిటీ
లను, కళాశాలలనూ, ఉన్నత విద్యాలయాలనూ
దర్శిస్తూ, విద్యార్థి లోకానికి నచ్చచెప్పటానికి చేయా
లసిన భగీరథ ప్రయత్నాల్ని చేయసాగారు. అంత
వరకు యుద్ధానికి వెళ్ళాలసిన వారి వయస్సు 18 సం||
లకు తగ్గివుండకూడదని ఒక నియమం వుండేది. ఆ
నియమాన్ని ఆలోచించేవారు వుంటేగా! 12 సం||ల
పిన్నలనీ—పిచ్చి పిచ్చి భ్రమలని, అలాంటి కుర్రల
బుర్రల్లో కెక్కిస్తూ-యుద్ధాగ్ని గుండంలోకి లాగటా
నికి శత విధాల ప్రయత్నం చేయసాగారు ఈ మం
త్రులు. విద్యాశాఖను వుద్ధరించాలసిన ఈ మంత్రి
శేఖరులు...మంత్రులు ఒక అడుగు ముందుకువస్తే,
ఇక విద్యాలయాల్లో, కళాశాలల్లో పనిచేస్తూవున్న
ప్రొఫెసర్లు మూడు అడుగులు ముందు వేసేవారు...నీతీ
నియమం అనేవి వుంటేగా వాటిని వారి సాంప్రదాయ
ప్రకారం తూ. చా. తప్పక పాటించటానికి?...
అయినా ప్రొఫెసర్లంతా అలాంటి వారని చెబుతానికి
వీలులేదు. జర్మను సాంప్రదాయాన్ని నిలువబెట్ట
టానికి, ఎన్ని కష్టాలు ఎదుర్కొనాలసి వచ్చినా,
సాహసంతో, త్యాగంతో, ముందంజ వేసిన ప్రొఫె
సర్లు కొందరు ఆ ప్రొఫెసరుజాతిలో ఆనాడు
వున్నారు.......

## 2

మ్యూనిచ్ విశ్వ విద్యాలయంలో తమ్ముడు
హాన్స్, చెల్లి సోఫీ చదువుతూ వున్నారని చెప్పా
నుగా! వాళ్లకు మల్లె వున్న ఆశయాలుగల అలెగ్జాం
డర్, క్రిస్టల్‌లతో వాళ్ళకు పరిచయ భాగ్యం కలిగిం
దనీ, ఆనాటి దేశ పరిస్థితులని గురించి తలపోయటా

నికి వాళ్ళంతా పడీ పడీ కనుకుంటూవుండేవారనీ ఇంతకుముందే తెలిపాను కదూ! వాళ్ళ ఉత్సాహాన్ని రెట్టింపుగా రేకెత్తించగల ప్రొఫెసరును ఆ విశ్వ విద్యాలయంలోనే వారు కలుసుకొనే భాగ్యం లభించింది. ఆ ప్రొఫెసర్ పేరు హూబర్. ఈయన తత్త్వశాస్త్రాన్ని బోధిస్తూవున్న పండితులు. విశాల హృదయుడు ఈ ప్రొఫెసర్. ఈయన తత్త్వశాస్త్రానికి సంబంధించిన విషయాలను గురించి ఇచ్చే ఉపన్యాసాలను వినటానికి ఆ శాఖలో చదువుతూవున్న విద్యార్థులేకాక, ప్రకృతి శాస్త్రాన్ని, వైద్యశాస్త్రాన్ని, మరి ఇతర శాస్త్రాలను చదువుతూవున్న విద్యార్థులూ తండోపతండాలుగా వస్తూవుండేవారు. అంచేత ఆయన క్లాసురూంలోకి విద్యార్థులు గంటకొట్టిన తక్షణమే రాకపోయారా ఆ గంట కాలమూ కూచోటానికి స్థలం దొరకక నిలుచునే వుండాలసి వచ్చేది.......

మూఫీ విశ్వ విద్యాలయంలో చేరిన రోజుల్లో ప్రొఫెసర్ హూబర్ దైవమాయను గురించి 17వ శతాబ్దంలో లైబ్‌నిచ్ పండితుడు చేసిన సిద్ధాంతాన్ని విద్యార్థులకు బోధిస్తూ వుండేవారు. లైబ్‌నిచ్ సిద్ధాంతాన్ని థియోడీజీ అని పేర్కొంటారు. సృష్టి స్థితి, లయాన్ని నిర్ణయించటానికి భగవానుడు చక్కని రాజమార్గాన్ని కనిపెట్టాడు. నాశనం అనేది వస్తే-అది ఏ మార్గాన వచ్చినా రావచ్చు—అది శాశ్వతంగా నిలిచిపోదు. ఆ నాశనంలోనే సృష్టికి సంబంధించిన తతంగమంతా వుంది. దాన్నే మానవుడు గ్రహించగలిగాడా,—అలా గ్రాహ్యం చేసుకొనడానికి సంస్కారం అవసరంకూడా—తన జాతిని నిర్మూలం చేయటానికి ఇతర్లు అవలంబించే పద్ధతులకి ఏ మాత్రమూ భయపడడు. అతని ధైర్య సాహసాలూ ఏ రూపాన తొణకవు. ఇలాటి అవస్థలో త్యాగం అవసరం. అత్యవసరంకూడా. అలా త్యాగం చేస్తూన్న వ్యక్తి ఆ లయావస్థలో నదురూ బెదురూ లేకుండా తన కార్య కలాపాన్ని నిర్విఘ్నంగా చూసుకొనగలడు. ఇరుగు పొరుగువారలకు ఆ సమయాన వూతగా నుండగలడు. తను నాశనమైపోయినా, తన ఆదర్శాల్ని నిర్విఘ్నంగా కొనసాగించటానికి మరొకరు ముందుకు రాగలరు, తద్వారా ఈ సృష్టి స్థితి లయలు వాటి పనులని అవే చక్కబెట్టుకుంటూ లోక పరిణామానికే కొత్త దృష్టిని కాంతినీ ప్రసాదిస్తాయి. కొత్త శక్తిని ఇస్తూవుంటాయి........

ఇదే కాలచక్రం. మన అయోమయావస్థలో మనం ఈ కాలచక్రం వెంట కదలటానికి శక్తిలేకపోయినా, ఆ చక్రమే, అంటే ఆ దైవశక్తే, మనల్ని, దాని వెంటనే దొర్లించుకుని వెడుతూవుంటుంది. తత్త్వశాస్త్రంలో ఈ సిద్ధాంతాన్ని సామాన్యపు రోజుల్లోనే అవగాహనం చేసుకొనడం కష్టం. ఇక యుద్ధపు రోజుల్లో ఆ సంగతి అర్థంచేసుకొనటం ఎంత కష్ట భూయిష్టాలతో నిండి వుంటుందో ఇక చెప్పాలా! భగవానుడు వున్నాడు. ఆయనే లోకాన్ని ఒక దోవలోకి తీసుకునిరావటానికి ఎన్నెన్నో ఎత్తులని పన్నుతూ వుంటాడు. ప్రతి ఎత్తుకీ ఇలాటి మనుషులనీ, అలాటి మనుషులనీ వుపయోగిస్తూ వుంటాడు. చదరంగంలో మనం మన ఆటల్ని కట్టివేయటానికి ఆ ఎత్తునీ, ఈ ఎత్తునీ అవలంభిస్తూ వున్నట్టు. అందుచేత ప్రతివ్యక్తీ తన తన పనిని సాధించటానికి, ఈ సమయాన సంసిద్ధంగా వుండాలి. ఆ పని ఎట్టిది? దాని మూలాన ఎలాటి కష్టాలను అనుభవించాలసివస్తుందో? అనే భావం అతని బుర్రలో వుండకూడదు. కార్యరంగంలో దిగటమే అతనిపని. తరువాత కార్య కలాపాన్నంతా ఆ శక్తి చూసుకుంటూ వుంటుంది....

ప్రొఫెసర్ హూబర్ చెబుతూవున్న ఈ సంగతులను వింటూవున్న సమయంలో హాన్స్‌కి ఆయన పరిచయభాగ్యం సంపాదించుకొనాలని కోరిక రేకెత్తింది. ఆయన మార్గాన్నే జర్మను పండితులూ, కవులూ, లోక సంస్కృతిని నిలువబెట్టటానికి చేసిన కృషిని గురించి హాన్స్ చదివాడు. ఆ రచనలు హాన్స్ ఆశయాలకి అనుగుణ్యంగా వున్నాయి. అంచేత ప్రొఫెసర్ హూబరుని కలుసుకుని ఆయనతో ఈ సంగతులని గురించి చర్చించాలనీ హాన్స్ ఆశ. ప్రొఫెసరుకూ ఇటువంటి శిష్యులేగా కావలసింది! ఆ పతి

చయ భాగ్యం తనకు లభించటంలో తాను తృప్తి పడ్డాడు కాదు. అలెగ్జాండర్‌ను, క్రిస్టల్‌ను ఆయన దగ్గరకు తీసుకుని వచ్చాడు. ప్రొఫెసరుకు తీరికవున్న సమయంలో వీళ్ళందరూ ఆయన దగ్గర వుండిపోవడం, ఆ రోజుల్లో జరుగుతూన్న విషాద సంఘటనలను తత్వ దృష్టితో అవగాహనం చేసుకొనటానికి ఆయనతో చర్చించటమూ, తద్వారా వాళ్ళ సందేహాల్ని తీర్చుకొనడం...... ఇదే వాళ్ళ దినచర్యలో తప్పని సరి అయిపోయింది. ఆ సమయాల్లో చెల్లి సోఫీ అక్కడే వుండేది. ఆ చర్చల్లో పాలుపుచ్చుకుంటూ, తన సంశయాల్ని నివారణ చేసుకుంటూ వుండేది.

3

సోఫీ మ్యూనిచ్ నగరానికివచ్చి అప్పటికి రెండు నెలలయినా కాలేదు...ఆరోజు వుదయాన సోఫీ యూనివర్సిటీ భవనంలో చూసిన దృశ్యాన్ని ఎలా మరచిపోగలుగుతుంది? ఆవరణంలో కరపత్రాలు! లోపల క్లాసు రూముల్లో ఆ కరపత్రాలే! అవన్నీ అక్కడికి ఎలా వచ్చాయో? అలా అక్కడ పడవేయటానికి ఆ పని చేసిన వాళ్ళకి సాహసం ఎంతో వుండి తీరాలి. ప్రాణానికి తెగించినవాళ్లే ఆ పనిచేయటానికి సాహసం చేయగలిగి వుంటారని చెప్పటంలో అతిశయోక్తి ఏ మాత్రం వుండదుగా! లోపలికి నడుస్తూవున్న వాళ్ళ దృష్టి అంతా ఆ కాగితాలమీదే! వాటిని తీసుకుని వాళ్లు చదువుతూ వున్నారు. అలా చదువుతూవున్న కాలంలో వాళ్ళ మొహాల్ని కన్నులార చూసే తీరాలి. కొంత మంది వుద్రేకాన్ని చూపుతూ వున్నారు. మరికొంతమంది వుత్సాహాన్ని చూపుతూ వున్నారు. ఇంకా కొంతమంది వాటిని చదువుతూ ఏవగించుకోవడమూ చూడవచ్చు......

సోఫీ అలాటి కరపత్రాన్ని తీసుకుంది. దాన్ని డూప్లికేటు మిషన్ మీద తయారుచేసి వుండాలి. అలా తయారుచేయటానికి ఎంతో కాలం పట్టివుండాలి. అందులో వ్రాయబడ్డ విషయమూ సామాన్యమైంది అయిలేగా? "తెల్లరోజా" కరపత్రం అని పెద్ద అక్షరాలతో పైన వ్రాయబడ్డది......సోఫీ ఆ కరపత్రాన్ని చదవటానికి ఆరంభించింది.

"ఇలా వీళ్ల హడావుడిని సాగనీయడానికి మనమే అంగీకరించామా మన జాతికి అప్రతిష్ఠ తెచ్చినవాళ్ళమవుతాము. మన సంస్కృతికే అపార కళంకాన్ని ఆపాదించిన వాళ్లమవుతాము......" ఆ మాటలు చదివేటప్పటికి సోఫీ ఆశ్చర్య చకితురాలయింది. ఇంత సూటిగా వున్న సంగతి వున్నట్టు చెప్పటానికి ముందంజ వేస్తూవున్నవాళ్లు ఈ రోజుల్లోకూడా వున్నారన్నమాట. దేశం గొడ్డు పోలేదు అని సోఫీ దాన్ని చదువుతూ వుబ్బి తబ్బిబ్బయి పోతూవుంది. ఆనంద భాష్పాలు బొటబొట కారుతూవున్నాయి...

"ఎవళ్లయినా ఈ సంగతిని నిర్భయంగా చెప్పివేయాలిగా! ఎంతకాలం దీన్నంతా చూస్తూ వోపికపట్టి వుండగలుగుతాం? బ్రహ్మరాక్షసిప్రళయతాండవాన్ని చేస్తూ ప్రజాకోటిని కలవరపెడుతూ వున్నది. ఎటు చూసినా వాళ్లని చంపివేయాలి, వీళ్లని హతం చేయాలనే నినాదాలేగా! అది చేస్తూవున్న భీభత్సం ఇంతింతని చెప్పాలా? బైట చిచ్చు. లోపల చిచ్చు. ఈ చిచ్చు ప్రజాకోటి శక్తి సంపదలని పెడదోవలకి త్రిప్పి వాళ్ళని అయోమయావస్థలో నింపటానికి చేస్తూవున్న భగీరథ ప్రయత్నాలని మీరే తెలుసుకున్నారా! ...... మీ గుండెలు గభీలవుతాయి...ఆ అవమానాన్ని భరించలేక తలల్ని వ్రేలాడవేయాలని వస్తుంది......నీతి నియమం అనేదాన్ని పాటించక ఆ రాక్షసిని కొనియాడుతూవుంది యీ ప్రజ, అసహాయావస్థలో వుక్కిరి బిక్కిరి అయిపోతూవున్న యీ జర్మను ప్రజ! ఆ రాక్షసి దారుణ కృత్యాల్ని జాతి పేరుతో, మతం పేరుతో సమర్థిస్తూ వున్నదికూడా. ఈ అయోమయావస్థలో తన నిజవ్యక్తిత్వాన్నే పూర్తిగా మరచి పోయింది......ఇలాటి రాక్షస కృత్యాలు మన జాత్యభ్యుదయానికి వేరు పురుగులు. ఆ పురుగులు వాటి పనిని ఇలా యథేచ్ఛగా కొనసాగించటానికి మనమే వూతనిచ్చామా!......

(సశేషము)

# శ్రీ రామ కర్ణామృతము

( ఆంధ్రానువాదము )

శ్రీ కల్లూరి. అహోబలరావు.



౩౪

స్నిగ్ధమౌ నల్లని నిడువు వెంట్రుకలచే
  గొప్ప నేత్రములచేఁ గొమరుమీఱి
చారు మొగంబుచేఁ జక్కని నుదురుచే
  భ్రూవిలాసంబుచేఁ బొలుపుమీఱి
రత్నదంతములచే – రాజిల్లు ముక్కుచే
  బింబోష్ఠములచేత, వేడ్కమీఱి
కంబు కంఠంబుచేఁ గఠినమౌ ఱొమ్ముచే
  పిడికిలి నడుముచే, ప్రియముమీఱి
రామ! ఆజాను బాహుండవై, మనోహ
రంబులగు, గొప్ప పిఱుదులు, రమ్యమైన
పిక్కలును, పాదపద్మముల్ చక్కగాఁ
గల్గియున్నావు; ప్రార్థింతు కావుమయ్య!

౩౫

హరుని తీక్ష్ణ కోదండంబు విఱిచినావు
జానకీ హృదయానంద! సారసాక్ష!
శ్రీ రఘూత్తమ! శ్రీ రామ! చేతు నీకు
వందనంబులు గావుమా – సుందరాంగ!

౩౬

ఎఱుగు, నీ నామరుచిని మహేశ్వరుండు,
అరయు, నీ పాద సామర్థ్యమౌ యహల్య,
శివధను వెఱుంగు నీ భుజ శ్రీ విలాస
మబ్ధి నీ బాణగతిఁ దెలియంగ నేర్చు,
నీ కరుణ యర్థమగు నాకు నిశ్చయముగ
కావుమయ్య! సీతాపతీ! కావుమయ్య

౩౭

దివ్యమౌ రథము నధిష్ఠించి, రణరణ
  ధ్వని సేయుచుండెడి ధనువుఁబట్టి
ప్రళయాగ్నితోఁబోలు బాణంబు సంధించి
  అస్త్రతూణీద్వయం బమరఁగల్గి
రాక్షసకోటుల రణమందు నిర్జించి
  సాధు సజ్జనులను శాంతపఱచి
అంగద సుగ్రీవ హనుమదాదులచేత
  సేవింపఁబడుచున్న శ్రీ శుభాంగ!
రామ! కెందామరలఁబోలు, రమ్యమైన
నేత్రయుగ్మంబులనుగల్గి, నిన్ను స్మరణ
సల్పువారల రక్షించు సారసాక్ష!
భజన సల్పెద నిరతంబు భక్తితోడ.

౩౮

బ్రహ్మాది దేవతల్ ప్రభవించినారు, నీ
  నాభి పద్మంబులో, నళిననేత్ర!
పదునారు లోకముల్ బవళించియుండు నీ
  గర్భగోళంబులో – కంబుకంఠ!
ఇందిరా రమణి, వసించు నీ వక్షస్థ
  లంబున సుఖముగా - లలితచరిత!
సాధు సజ్జన మహాజనులు, నీ నామ మం
  త్రము, బఠియింతురు, తత్త్వవేత్త!
రామ! సర్వశుభాకర! ప్రణతులొసఁగి
ప్రార్థనముసేతు; సంసార బంధనములఁ

(395.వ పేజి చూడుడు)

# 'రాగమయి'

### శ్రీ విజయ - రాఘవ

(గతసంచిక తరువాయి)

పాలకోసం చంటిబిడ్డ చనిపోయిన తల్లి రొమ్ము చీకుతూన్న దృశ్యం, క్రొత్తగా పెళ్ళయ్యి ప్రయాణం చేస్తున్న దంపతుల శవాలు, యిలాంటివన్నీ కళ్ళల్లోకి దొంతర దొంతరగా తరలి వస్తున్నాయి. బరువుగల యినుపస్తంభానికి, కొయ్యబల్లకి మధ్య యిరుక్కుపోయి, తప్పించమని కుటుంబరావును సహాయం కోరుతున్న కామేశ్వరరావు కేకలు సుందరమ్మను కలవరపరిచాయి. బావకు సహాయం చేసే నిమిత్తంగా కుటుంబరావు ఆ కేకవిని తర్వాత రైల్లో బయలుదేరి వస్తున్నట్లు, ఆ రైలు శరవేగంతో పట్టాల మీద కాకుండా పోతున్నట్లు, "పడిపోతావేమోరా! అన్నయ్యా" అని తాను మందలిస్తున్నట్లు, చివరకు ఆ రైలు కనిపించకుండాపోయి, ఒక చీకటి గుహలోకి దూరినట్లు, కుటుంబరావు ఆ వేగానికి తట్టుకోలేక, పట్టుకొన్న ఆధారాన్ని వొదిలివేసి, అనంతమైన అఘాతంలోకి చొచ్చుకొనిపోయినట్లు" కలవరించింది. చివాలున లేచి కూర్చుంది. కుటుంబరావు దగ్గు తెరలవల్లోపడకుండా నిశ్శబ్దంగా పడుకొని వున్నాడు. గూట్లో వెలుగుతున్న కిరసనాయిలు దీపం ఆరిపోయేటప్పటికి సుందరమ్మకు బాగా తెలివి వచ్చింది. కళ్లు నులుముకొని తేరిపార చూసింది. ఇంతలో రెండువీధి కుక్కలు జోరుగా మొరుగుతున్నాయి. అపశకున సూచకంగా మరికొన్ని కుక్కలు కుయ్యోమంటూ రాగాలాపన చేస్తున్నాయి. సుందరమ్మ తలపైపున వున్న మరచెంబులోంచి ఒక గ్లాసుడు మంచినీళ్లు త్రాగింది. చీకట్లో గ్లాసు నేలమీద పెట్టినట్లు శబ్దం అయింది. గదిలోంచి రాగమయి "అమ్మా!" అంది. "ఆ... నేనే లే...!" అంది సుందరమ్మ. వీధి తలుపు తట్టినట్లు యింతలో వినిపించింది. సుందరమ్మ మనస్సులో రకరకాలైన ఆలోచనలు కలిగినట్లు ధ్వనించింది.

"అత్తయ్యా!" అని యీ సారి కేక వినిపించింది. సుందరమ్మ ఆ గొంతు గుర్తుపట్టి వెళ్ళి తలుపుతీసింది. మబ్బు పట్టిన ఆకాశంమీద మనుష్యులెవరో నల్లగా కనిపించి, తనవంక చూస్తూ వెకిలిగా నవ్వినట్లు, తాను ఆ నవ్వుచూసి భయపడినట్లు సుందరమ్మకు భ్రమ కలిగింది. తీతువు— "నా విధి కూస్తూ వెళ్ళడమేగా" అన్నట్లు రెక్కలాడించుకొంటూ, ఆ నల్లని మనుష్యుల పాదాల సమీపంలోంచి వెళ్ళిపోతూండటం కనిపించింది.

"రఘూ! యేమిటింత పొద్దుపోయి రావటం?" అంది సుందరమ్మ.

"కారందలేదు నడిచి వచ్చాను!" అన్నాడు రఘునాథం.

"ఇంత చీకట్లో నడిచి రాకపోతే జట్కా చేయించుకొని రాకపోయావా" అంది సుందరమ్మ.

ఇంతలో రాగమయి సింహద్వారం తలుపు తెరచుకొని బయటికివచ్చి నిల్చుంది.

"రఘూ! నీళ్ళున్నాయి స్నానం చేద్దుగాని, రా!" అంది సుందరమ్మ.

"ఆ... యిప్పుడెందుకు లెద్దూ! చాల పొద్దుపోయింది"—అన్నాడు.

"ఈలోపుగా అన్నం పెడుతుంటాను బావా!" అంది రాగమయి.

"స్నానంచేయ బుద్ధికావడంలేదుగాని, కాస్తన్నం పెడుదూ పాపా!" అన్నాడు రఘునాథం.

రాగమయిని "పాపా" అని పిలవడం రఘునాథానికి ముచ్చటగా వుంటుందని సుందరమ్మకు తెలుసు. ఇదివరలో రఘునాథమే యీ విషయం ముఖాముఖిగా అన్నాడు కూడా. అప్పుడు సుందరమ్మ నవ్వుతూ— "నీ యిష్టమొచ్చినట్లు పిలూ. ఎలా పిలిస్తేమాత్రం అది పలకదూ! నువ్వేమన్నా దానికిష్టమే!" అంది సుందరమ్మ. రాగమయికి యెందుకో బావ, 'పాపా'

అన్నప్పుడల్లా లేడి పిల్లలాగా బెదురుతూ చూస్తుండేది. 'పాపా' అన్నప్పుడు "తనింకా చంటి పాపాయినే మో! బావ దృష్టిలో" అని అనుకొంటూండేది. శ్యామసుందరికి "బాగానేవుంది నీపేరు" అని రాగమయిని, "ఏరికోరి పెట్టుకొన్నావ్" అని రఘునాధాన్ని మెచ్చుకొంది. ఇదంతా జరిగింది వాళ్ళ వాళ్ళ సంసారాలు సుఖంగా గడుస్తున్న రోజుల్లో.

రాగమయి కాళ్లు చేతులు కడుక్కుంటానికి వేన్నీళ్లు యిత్తడి చెంబుతో తెచ్చి—"కాళ్లు చేతులు కడుక్కో బావా!" అంటూ అందించింది,

రఘునాధం కడుక్కుంటుండగా రాగమయి లాంతరు పెద్దచేసి కంచంలో అన్నం వడ్డించింది. సుందరమ్మ వెంట రఘునాధం లోపలికివచ్చి అన్నం ముందు కూర్చున్నాడు. రాగమయి వడ్డిస్తోంది. సుందరమ్మ యెదురుగా గోడ కానుకొని జారగిలబడి కూర్చొంది.

"నాన్నేనా! వాకిట్లో పడుకొంది?" అని అడిగాడు రఘునాధం.

"ఊఁ... నాన్నే"... అంది సుందరమ్మ.

"యివ్వాళ పెందలాడే వచ్చినట్లున్నాడు" అన్నాడు మళ్ళా మామూలుగా.

సుందరమ్మకు యెందుకో ఆదుర్దా యెక్కువయింది. చెప్పాలని కుతూహలం, చెప్పకపోతే యేమనుకొంటాడో, యెప్పటికైనా చెప్పాలిగదా! అనే బాధ అంతకంతకు యెక్కువవటం మొదలుపెట్టింది. "పెందలాడేమిటిలే! యిదివరకన్నా కాస్త ముందొచ్చాడు" అంది దీనంగా.

రఘునాధం భోజనం ముగించుకొని వసారాలోకి వచ్చాడు. రాగమయి కంచం కడిగేసి తలుపులన్నీ గట్టిగా గడియవేసి సుందరమ్మతోపాటు వసారాలోకి వచ్చేసింది.

రఘునాధం అన్నం తిన్న తరువాత అటూ యిటూపచార్లు చేసే అలవాటు చొప్పున తిరుగుతున్నాడు. సుందరమ్మ నారింజపండ్ల రసం తీసి కుటుంబరావు కిద్దామని వచ్చింది. తిరుగుతున్న రఘునాధానికి రెండుమూడుసార్లు బాగా వినిపించింది. సుందరమ్మ "అన్నయ్యా! అన్నయ్యా!" అని పిలిచింది. సుందరమ్మ వెంటనే పమిట చెంగు నోటి కడ్డంగా పెట్టుకొని వెక్కి వెక్కి ఏడ్వటం రఘునాధం కొంత సేపటికి గాని వినిపించుకోలేదు.

"అత్తయ్యా!" అన్నాడు రఘునాధం

"అమ్మా! బావ పిలుస్తున్నాడే!" అంది రాగమయి దగ్గరగావచ్చి.

రఘునాధం లాంతరు కొంచెం పెద్దచేసి కుటుంబరావు మొగంమీద వెలుతురుపడేలాగు పుచ్చుకొన్నాడు. సుందరమ్మ బావురమనడంతో రఘునాధంకి, రాగమయికి కళ్లు చెమర్చినయి. కుటుంబరావు ఆత్మలోంచి నిర్జీవమైన నిట్టూర్పు వాయువు మాత్రమే వెలుపలికి వస్తోంది. రాగమయి వెళ్లి శ్యామసుందరిని లేపింది. విషయం అంతా తెలిసీ తెలియనట్లు చెప్పింది. శ్యామసుందరి చెరిగిపోయిన తలతో, నలిగిన చీరతో వసారాలోకి వచ్చి రఘునాధం వంకచూసి, అప్రయత్నంగా పమిట చెంగు కొస నోటికడ్డంగా పెట్టుకొంది. కాని పొర్లివచ్చే దుఃఖం ఆగటంలేదు.

ఉత్తరవైపు ప్రహరీ గోడ ప్రక్కన అరుగుమీద, మోకాలిమీద చేతులు పెట్టుకొని ఆకాశం వంక చూస్తూన్నాడు రఘునాధం. కుటుంబరావు మంచం రఘునాధం అరుగు దగ్గరకు చేర్చిన తరువాతే తానలా కూర్చుండిపోయాడు. సుందరమ్మ ఒక మూల గోడ కానుకొని కూర్చుంది. రాగమయి రఘునాధం కెదురుగా నిల్చుంది. శ్యామసుందరి తలుపుదగ్గర నిల్చుండలేక కూర్చొంది.

"నా దత్తత యేదుష్టనక్షత్రంలో జరిగిందో! అది మంచి నక్షత్రమని అపోహ పడ్డారంతా. తల్లిలేని కుటుంబంలోకి వచ్చిపడినందుకు, తండ్రిని చూసుకొని కొంత స్థిమితపడ్డాను. ఈ రోజుతో అది కాస్తా తీరిపోయింది. ఆస్తి వ్యవహారాలు చూడబోతే

అయోమయంగా వుంది. అత్తయ్య కుటుంబాన్ని చేరదీసానని లోకం అంతా కోడై రకరకాలుగా అనుకొంటూ కూస్తోంది. తల్లిలాగా చూస్తున్న అత్తయ్య కుటుంబాన్ని వేరుగా వుంచి, వాళ్ళకు కావలసిన సౌకర్యాలన్నీ కల్పిద్దామా! అనుకొంటే, నేను వండుకు తింటం చేతగాని వెధవనైతిని. యీడొచ్చిన పిల్లలకు పెళ్ళిళ్లు చేయవలసిన బాధ్యత అత్తయ్యకుంది. నా ఆస్తికి సర్వహుక్కుదారున్ని నేనే! నాన్న చేసిన అప్పులెంతెంత వున్నాయో నెమ్మదిమీదగాని తెలియవు. అంతవరకు నాకు అడకత్తెరలో వున్నట్లుగానే వుంటుంది. శ్యామసుందరి చదువూ రాగమయి చదువూ యెలాగో పూర్తయితే సుందరమ్మత్తయ్యకు అంత బాధనిపించదు. ఇదంతా జరగటం ఎట్లా?"

రఘునాథానికి యిలాంటివి ఆలోచించేటప్పటికి బుర్ర వేడెక్కింది.

ఆకాశం మీద పట్టిన దూది పింజల్లాంటి మబ్బులు గాలికి విడిలి పోయాయి. మినుకు మినుకుమంటూ మళ్ళా నక్షత్రమండలం కనిపించింది. యీ దృశ్యాన్ని చూస్తూవుండేటప్పటికి రఘునాథానికి కల్గిన ఆలోచనలూ — వాటికి సాక్షిభూతమైన దృశ్యాలున్నూ—

3

కుటుంబరావుకి చేయవలసిన దహన సంస్కారాలన్నీ సలక్షణంగా చేసాడు రఘునాథం. ఊళ్లో కుటుంబరావు చేసిన బాకీలు అన్నీ మొత్తం చూస్తే దాదాపు రెండువేలదాకా డేకింది. తన పేరవున్న భూమిలో అర్ధయెకరం అమ్మేసి, యెటువంటి తగాదాలు రాకుండా బాకీలు తీర్చేశాడు. కుటుంబరావు చేసిన అప్పులు తెలుసుకొని రఘునాథం బెదిరిపోతాడేమోనని సుందరమ్మ, రాగమయి, శ్యామసుందరి అనుకున్నారు. ఒక్క వీళ్ళేగాదు. వూళ్ళోవాళ్ళు కూడా అనుకోకుండా మానలేదు. అటువంటిదేమీ రఘునాథంలో కనిపించలేదు. సరిగదా! చాలా సంతోషించాడు. సుందరమ్మ యీ సంతోషానికి ఆశ్చర్యపడింది. "రఘూ! నాన్న యెంత అప్పు చేసాడో తెలిసిందిరా!" అని అడిగింది అప్పు తీర్చక ముందొకసారి.

"మొత్తమంతా రెండువేలదాకా!" అన్నాడు రఘునాథం.

"ఎంత తగలేశాడురా! చీట్ల పేకలో యీ వూరి పోకిరీ వెధవలంతా కలిసి, వాడికీ ఆటనేర్పి, చివరకు తాగుడు కూడా అలవాటుచేసి, వాడి సొమ్మంతా తెగతిని, వాడి కొంపకే నిప్పంటించి ప్రాణాలు తీశారు." అని సుందరమ్మ వుక్రోషంతో అంటూంటే —రఘునాథం జీవంలేని చిరునవ్వునవ్వుతూ—"నాన్న యింతచేసి ఆస్తి పాడు చేసాడని నువ్వేమీ బాధపడకత్తయ్యా! అమ్మ పోయిన బాధతో ఆయనకు మనసు పూర్తిగా చెడిపోయింది. ఆయనేంచేస్తున్నాడో నాకు తెలియక పోలేదు. ఎట్లా చేసినా, ఆయనంటే నాకు పితృభక్తి వుంది కాబట్టి నేనే విధంగానూ ఆయన్ను గురించి విచారపడలేదు. చెడిపోయాడనేది మనం అనుకోకూడదు. సుఖంగా బ్రతుకుతామనేది అమ్మపోయిన తర్వాత కలగలేదు. యిక బ్రతికినంత కాలం ఆమెను తల్చుకొని యేడ్వాలి. ఏదో వ్యాసంగంలోకి దిగితే సగం ఆయాస పోతుందేమో! అని ఆయన తల్చుకొని వుండొచ్చు. చివరకు ఆ వ్యాసంగంలోని అవలక్షణాలన్నీ అలవాటయినయి. ప్రాణం మీదికి తెచ్చే అలవాట్లని ఆయనకు తెలియదంటావా! ఎవరికోసం యీ బ్రతుకును గడపటం? అని విరక్తిపడి వుంటాడు. నా వుద్దేశ్యంలో ఆయన యిలా చనిపోయి తీరతానని అనుకొని వుంటాడు. అందుకే అంతతప్ప తాగినప్పటికీ తనయిల్లు, తన సంసారం, అనేవి వున్నయ్యనీ, తనవాళ్ళొకరైనా వున్నారని, వాళ్లందరి దాపులో చద్దామని అనుకోబట్టే, తూలుతూ అయినా రక్తం కక్కుకుంటూ కూడావచ్చి సొంతయింటిముందు ప్రాణాలు విడిచాడు. తీరని బాధను అనుభవిస్తూ, తీసుకు చావడంకన్నా, ఆకస్మికంగా చావడం అదృష్టంకాదూ. ఎంత చెప్పినా! ఆయన ధన్యుడు. యీ చావే గనుక యే నడివీధిలోనో, యే మురుగు కాల్వలోనో అయితే లోకం అంతా యెంత నీచంగా

చెప్పకూడనిదేదో తెలుసా! ఆ విషయం వింటే మరీ యెక్కువ బాధపడేవాళ్ళం," అంటూ రఘునాథం చెపుతూంటే సుందరమ్మకు కొంత మనశ్శాంతి కలిగినట్లనిపించింది.

శ్యామసుందరి "రఘునాథం ఒక వేదాంతి" అని భ్రమ పడింది.

రాగమయి "బావా!" అని మనసులో తీయగా పిలుచుకొంది.

యీ సంఘటనంతా యిలా జరిగింది, రఘునాథం అప్పులు తీరుస్తున్న రోజుల్లో

పరిస్థితులన్నీ చక్కబడ్డ తరువాత ఒకనాడు సుందరమ్మతో కొన్ని విషయాలు మాట్లాడాలని అనుకొన్నాడు రఘునాథం. కుటుంబరావు పోయిన తరువాత సుందరమ్మేగా ఆ యింట్లోకల్లా వయస్సులో పెద్ద.

ఆనాడు సుందరమ్మ ఒక్కతే యింట్లో వుంది. రాగమయి, శ్యామసుందరి బళ్ళోకి వెళ్ళారు. రఘునాథం నెమ్మదిగా సుందరమ్మను కదలేస్తూ. "అత్తయ్యా నీతో యీ సందర్భంలో ఒక విషయం ముచ్చటిద్దామని వుంది. నువ్వేమీ అనుకోనంటే ప్రస్తావిస్తా మరి!" అన్నాడు. సుందరమ్మ, రఘునాథం యేం చెప్పినా నచ్చితీరుతుందనే అభిప్రాయం గల్గివున్న మనిషి. అందువల్ల యేఅనుమానం, ఆదుర్దా లేకుండానే "ఫరవాలేదులే రఘూ! చెప్పు. యేమీ అనుకోన్లే." అంది.

"నా ఆస్తి-నా చదువుచూసి, నన్ను నువ్వు వలలో వేసుకొన్నావనీ, రాగమయినిచ్చి వివాహంఅనే పేరిట అంటగడదామని ప్రయత్నిస్తున్నట్లు, యీ వూళ్ళో నేగాదు, మనచుట్టాల్లోకూడా చాలామంది అనుకొంటూండగా యిదివరలోనూ, యిప్పుడూ, చాలాసార్లు వింటూవస్తున్నాను. అది నిజం అని నేనెప్పుడూ నమ్మను. ఇదికూడా మనస్ఫూర్తిగా చెబుతున్నా-" ఇది యిలావుండగా—.

"రాగమయితో, నాకున్న పరిచయం, శ్యామసుందరితో వుండలేదని, రాగమయినే, నే నెక్కువగా చూసుకొంటున్నానని, నాకున్నదల్లా రాగమయేనని, శ్యామసుందరి వుత్త మందబుద్ధిగల మనిషితోజమని," మరొక రకమైన ప్రచారం ఒకటి మన చుట్టాల్లోనే బయలుదేరింది, యిది యెంతవరకు నిజమో! నీవే వూహించుకో! యీ విషయం యిలా కల్పించి నిన్ను మోసం చేద్దామని నాకెట్టి అభిప్రాయంలేదు సుమా! నా సంగతి నేనెలా మాట్లాడేది నువ్వెరుగందికాదుగా! బుద్ధి తెలిసినప్పటినుంచి పెంచి పెద్ద చేసావు. వరుసకి అత్తయ్యవైనా, నిజంగా కన్నతల్లితో సమానమైన దానివి. నీ చేతికూడు తిని, నిన్ను యెలా మోసపుచ్చుతా! ఉన్న మాట చెపుతున్నా!" అన్నాడు రఘునాథం.

సుందరమ్మకు యేవిధంగా సమాధానం యివ్వాలో అర్థంకాలేదు.

"రఘూ! ఎవరో అనుకొంటున్నారని నే నేమీ అనుకోను. నువ్వు నన్ను మోసంచేసి, బాధిస్తావని నాకెప్పుడూ లేదు. ఒకవేళ రాగమయిని నువ్వుకావాలన్నా, రాగమయికి నువ్వు యిష్టపడినా, నేనెప్పుడూ యెట్టి పరిస్థితుల్లోనూ అభ్యంతరపెట్టను. శ్యామసుందరి విషయంలో మాత్రమే వెనుకంజ వేయాల్సొస్తోంది. పెళ్ళికెదిగివుంది. యీ సంవత్సరంతో ఆ కాస్త చదువు పూర్తవుతుంది. దాన్ని గురించే అప్పుడప్పుడూ ఆదుర్దా కలుగుతూంటుంది. రాగమయి పుట్టినప్పుడే అనుకొన్నాం, నేనూ-మామయ్యానూ. నీ గురించి నాజీవితం, నాకుటుంబం యీ నాడుకి యిలా అవుతుందని, నువ్వాశ్రయమిచ్చి కాపాడుతావని కలలోకూడా అనుకున్నానా! యేదో జరిగిపోయింది. పదిసార్లు అనుకొంటేమాత్రం వచ్చేలాభం యేముంది!" సుందరమ్మ గొంతు బొంగురుపోయింది. యీ మాటలంటుంటే రఘునాథం అదిగుర్తించాడు.

(సశేషము)

# గాలిపడగలు

శ్రీ కో⁰కా బాలకృష్ణరావు



అంధకార బంధురమైన జీవితంలో వెలుగు రేఖలా, ఆగాఢాంధకారంలోనించి ట్రెయిన్ హెడ్‌లైట్ దూసుకుపోతోంది.

అర్ధరాత్రి.

సూన్యంలో ప్రకృతి నిద్రపోతోంది.

ఇరుప్రక్కలా వ్యాపించిన పొలాలు, తోపులు, కొండలు, చిట్టడవులు, దాటి, వంతెనలమీదుగా దడదడా ధ్వనిచేసుకుంటూ, గుండెల్లోనించి దూసుకొని బయటపడే పిస్తోలు గుండులా ఎక్కడో ఒక కొండ కడుపులోదూరి, మరొకవైపు నించి బయటపడుతుంది.

ఈ నిశ్శబ్ద ప్రకృతిలోని సుందరజీవాణువుల పరిణామానికి, గంభీరస్థాణువుల రమణీయత్వానికీ కర్మసాక్షిగా ప్రతిరోజూ ఆ రెండు సమానాంతర రేఖలమీదుగా ప్రయాణంచేస్తోందా రైలుబండి.

అంతంలేని ఆకాశంలాగా, అనంతమైన సముద్రంలాగా, ఈ రైలుబండికూడా చిరకాలం వుండిపోయేదే గాబోలు!

రైలు టకటకా శబ్దంచేసుకుంటూ పోతోంది. మధ్య మధ్య అదిచేసే గర్జన ప్రకృతి గుండెలే అవిసిపోతున్నాయి.

నిజంగా ఇంతటి గంభీరమైన ఒక సాధనాన్ని కనిపెట్టిన ఒక మానవుడు ఎంత గొప్పవాడు!

ఎంత వద్దనుకున్నా 'వెంటిలేటర్' తెరుచుకొని బయటిసూన్యంలోకి చూడబుద్ధివేస్తోంది.

అప్పటికి రాత్రి పదిగంటలైంది. బయటంతా దట్టంగా చీకటి వ్యాపించివుంది. బండీలో అంతా అస్తావ్యస్తంగాపడుకొని కునుకుతీస్తున్నారు.

పైనలైటు నిర్విరామంగా వెలుగుతోంది. దానిచుట్టూ దోమలు మూగుతున్నాయి. రైలు రెండు పట్టాలమీదుగా పోతూనేవుంది.

జనం అంతా నిద్రపోతూనేవున్నారు.

ఒక్కసారి బండీ అంతా కలియజూశాడు శాంతారావు. మరొకసారి బయటి ప్రకృతివంక చూశాడు. చివరికి చేతులో పత్రికవంక చూసుకున్నాడు.

నిద్ర రావటంలేదు.

హాయిగా నిద్రపోతున్న వాళ్లు ఆనందం పొందుతున్నారా! ఈ గంభీర భయంకర ప్రకృతిని చూస్తూ తను ఆనందం పొందుతున్నాడా!

గాంభీర్యంలో, ఏకాంతంలో కూడా ఆనందంవుందా!

ఇప్పుడు తన హృదయంలో ఏం భావాలు తారాడుతున్నాయి.

హృదయంలోపల ఆనందం

బయట ఏకాంతం.

ఏకాంతంలో భయం—

భయంలో ఆనందం.

ఇది హృదయంలో ఆనందమూ!

భయంలో ఆనందమూ!

అంతవరకూ అడ్డంగావున్న గ్లాస్ విండోనికూడా పూర్తిగా దించేసి, ఆ భయంకర ప్రకృతిని లోనికి ఆహ్వానించాడు కాంతారావు.

తలుపు తెరచీ తెరవటంతో ఓ రివ్వుమని ఒక చల్లటిగాలి తెరలోపలికి తోసుకు రావటంతో, అంతవరకూ మామూలుగా కూర్చున్న కాంతారావు ఒక్కసారిగా రెండుకాళ్ళు బల్లమీద పెట్టుకొని, మోకాళ్ళు గుండెల్లోకి లాక్కున్నాడు.

చలిగాలికి నెత్తిమీద ఉత్తరియం కప్పుకొని, ముడుచుకు పడుకున్న ఒక అసామి ఒకసారి ముసుగుతీసి ; కిటికీవైపు ముడుచుకూర్చొని, శూన్యంలోకి కళ్ళు చించుకొని చూస్తున్న కాంతారావు వంక ఒకసారి ముఖం చిట్లించుకొనిచూసి, అటువైపు తిరిగి, మరికొంచెం ముడుచుకున్నాడు గొంగళిపురుగులా. కాంతారావు సూన్యంలోకి చూస్తూనే వున్నాడు.

పెద్ద పెద్దచెట్లు ముసుగు కప్పుకున్న దయ్యాల్లా వెనక్కి పరిగెడుతున్నాయి. టెలిఫోన్ స్థంభాలు రాకాసుల్లా వాటిని వెంబడిస్తున్నాయి.

ఆ కిటికీలోనుంచి, ఆ చీకటిలోనించి, ఆ సూన్యంలోనించి, అవతలికి, ఇంకా అవతలికి చూస్తే ఏముంటుంది ?

కాంతారావు నవ్వుకున్నాడు.

కాసేపు అదంతా బొమ్మలాటలా, తానొక విశ్వకర్మలా ఊహించుకున్నాడు. ఒక చిన్నరైలుపెట్టెలో ఒక పెద్ద బ్రహ్మాండాన్ని సృష్టించుకున్న తానెంత ఘనుడు!

కాంతారావు మళ్ళీ నవ్వుకున్నాడు.

ఈసారి తన తెలివితక్కువ తనానికి నవ్వుకున్నాడు.

అనంతకోటి జీవరాసుల్లో ఒక పిపీలిక — అనేక వందలమంది ప్రయాణీకుల్లో తను—

ఇంతే—.

ఇంతలో ఏదో స్టేషను రావటంచేత బండి వేగం తగ్గింది. క్రమంగా కొంత వెలుతురు మెల్ల మెల్లగా బండిని సమీపించింది. కాని ప్లాట్‌ఫారంమీద జనం ఎక్కువ లేరు.

ఉన్న నలుగురూ ఏవోఅందిన పెట్టెల్లో ఎక్కారు.

మళ్ళీ బయలుదేరింది రైలు

◆ ◆ ◆

ఎట్లాగైతేనేం రాత్రి పన్నెండు గంటలకి రైలు కాంతారావు దిగవలసిన స్టేషనులో ఆగింది.

క్రిందికిదిగి, బ్యాగ్ చేత్తోపుచ్చుకొని, ఒక్కసారి బండివంక చూశాడు. అది మెల్లగా కదిలింది గాడిదలాఅరుచుకుంటూ. ఒక్క క్షణంలో ఒక చిన్న చుక్కలా అయి, సూన్యంలో కలిసిపోయింది.

కాంతారావు ప్లాట్‌ఫారమంతా కలియజూశాడు. అక్కడక్కడా పెట్టిన రైల్వే లాంతర్లు గుడ్డిగా వెలుగుతున్నాయి. నీడలేని నిర్వాసులూ, ఆ పూటకి కదిలే ఆశలేని ప్రయాణీకులూ, అక్కడక్కడా బల్లల మీదా, సిమెంటు 'స్లాబ్'ల మీదా, పెట్టెలమీదా పడుకొని నిద్రపోతున్నారు.

ఆ మసక వెలుతుర్లో, తనకు కావలసిన వ్యక్తి అక్కడికి వచ్చినట్టు కాంతారావుకి కనిపించలేదు. నిద్రపోయే ఒక్కొక్క వ్యక్తిని పరీక్షించటం అంతకంటె అసభ్యంగా, అసందర్భంగా కనిపించిందతనికి. అయినా తనకి కావలసిన వ్యక్తి నిద్రపోతున్న పక్షంలో అతన్ని తను యిక్కడ వెతకటం పూర్తి అనవుసరం. మేలుకుని వున్న పక్షంలో అతనే తనని వెతుక్కుంటూ వచ్చేవాడు.

చిక్కు తీరిపోయింది కాంతారావుకి.

తను వెళ్ళవలసిన యిల్లు తనకి సరిగ్గా తెలియదు. అయినా ఈ అర్ధరాత్రి వెతకటం ఎట్లా ?

నిద్ర కూడుకు వచ్చేస్తోంది. అంతవరకూ బండిలో కట్టెలాకూర్చొని వుండటం చేత వళ్లంతా విరగ్గొట్టినట్టుంది.

ఒకసారి అటూ యిటూచూసి, కాస్త ఖాళీ స్థలంగా వున్న చోటికి చేరి, బ్యాగ్‌లోనించి తుండుతీసి, కొద్దిస్థలాన్ని శుభ్రం చేస్తుండగానే 'ఏరోయ్! ... ఎప్పుడు రావటం!!' అన్నపిలుపు వినిపించింది వెనకనించి మందంగా.

వెనక్కి తిరిగేలోపలేవచ్చి బుజం తట్టాడు ప్రసాదు.

కాంతారావుకి వళ్ళుమండింది. వీడొక కుంభకర్ణుడు. స్టేషనుకి వెళుతున్నానని చెప్పి, ఏస్నేహితుడి రూంలోనో గురకపెడితే, రైలుకూతవిన్న ఆ ఆపద్బాంధ

వుడు వీడికి నిద్రాభంగంచేసి ఇటుతోలే వుంటాడు.

ఒక చెంపన - అప్పుడే రైలుదిగి అవస్థ పడుతుండగావచ్చి 'ఏరోయ్ ... ఎప్పుడు రావటం !'- అంటాడు నిద్రని నములుతూ ఎరగనివాడిలా. అదేనా పరామర్శించే విధానం ?

కాసేపు నిశ్శబ్దంగా గడిచింది. రోడ్డు మీద రిక్షాలోపడ్డతర్వాత ప్రసాదు అవస్థ చూసేటప్పటికి కాంతారావుకి జాలివేసింది. తాను ఆ అర్ధరాత్రి స్టేషనులోదిగి, హాజరు లేని నౌకర్లకోసం హంగామా చేయటానికి తానెవరు ?

అసలు తానెందుకు యిక్కడికి వచ్చింది ?

ఇప్పుడు కాస్త తెరిపిడిపడ్డది కాంతారావుకి.

అసలు తనను తానుగా ఇప్పుడు చూడగలుగుతున్నాడు.

తను ఎందుకువచ్చాడు ?

చెల్లెలిపెళ్ళి సంబంధం చూడటానికి అమ్మతరిమితే వచ్చాడు.

సరే. ఆ విషయం తెల్లవారింతర్వాత మాటవచ్చునని మాట్లాడకుండా ప్రసాదుతో వాళ్ళింటికివెళ్ళాడు కాంతారావు.

♦ ♦ ♦

ఉదయమే నిద్రలేచి కాలకృత్యాలు తీర్చుకున్నాడు. ప్రసాదు కుటుంబంతో తమ కుటుంబానికివున్న స్వల్పబంధుత్వం కన్నా, గాఢపరిచయాన్నిబట్టి ఆ యింట్లో కాంతారావుకి మంచి మర్యాదలే జరిగాయి.

అదిగాక యీ సంబంధాన్ని చూపించింది అసలు ప్రసాదు తండ్రి నాగేంద్రమే.

ఉదయం పదిగంటలయ్యేటప్పటికి, నాగేంద్రం, కాంతారావుకలిసి పెండ్లివారింటికి వెళ్లటం పిల్లవాడ్ని చూడటం అన్నీ జరిగాయి. తలపండినవాళ్లు చూపించే అణకువ అతివినయం కాంతారావు ఏమీ చూపించలేదు. కానీ కాంతారావు తరఫున అది నాగేంద్రం పూర్తిచేశాడు.

అక్కడి నాగేంద్రం ప్రవర్తనచూసి కాంతారావు అసహ్యించుకున్నాడుకాని, తనను తాను సంబాళించుకున్నాడు అప్పటికి.

యథావిధిగా వచ్చేటప్పుడు 'మంచి రోజుచూసి ఉత్తరంరాస్తారు. మీరువెళ్ళి అమ్మాయిని చూసుకోవచ్చు' అని తన తరఫున వకాల్తాపుచ్చుకున్న నాగేంద్రం అనటంతో, కాంతారావుకి నోటమాట రాలేదు.

వచ్చినపని త్వరగానే అయిపోయింది. తరువాత కార్యక్రమం గురించి ఆలోచించాడు కాంతారావు.

అతనికి హటాత్తుగా గుర్తుకివచ్చింది. అక్కడికి దగ్గరపల్లెలోవున్న తన మేనబావ కుటుంబం గురించి.

ఇంకా చాలా వ్యవధివుంది. తాను అంతపడుతూపోయి ఇంటిదగ్గర చేసేపని కూడా ఏమీలేదు.

ఇక పెట్టిన వారంరోజుల శలవు ఎట్లా గడపాలి!

మెల్లగా నాగేంద్రానికి బస్సుస్టాండు దగ్గరే శలవిచ్చి తాను బస్సుఎక్కాడు కాంతారావు.

(సశేషము)

# బిడ్డలు - తల్లిదండ్రులు

## విశిష్ట సాంఘిక ప్రవృత్తులు

శ్రీ కె. వెంకట్రామయ్య

(మే సంచిక తరువాయి)

### అధికారేచ్ఛ (Desire for power)

ఇది మానవులందరకును సహజమగు కోరికయై యున్నది. ఇదియే వారిని పోటీలకు పురికొల్పుచు వైరముగా పరిణమించును. "తనసొత్తు కావలెన"ను కోరిక జనించిన పిదపనే పిల్లలీయధికారేచ్ఛనుజూప నారంభింతురు. ఇంటిలో నొకబిడ్డ నెల్లపుడు మెచ్చు కొనుచు మరియొకబిడ్డను గమనింపకున్నను, విమర్శించు చున్నను అతనికి మొదటివానిపై ద్వేషముకలుగు చుండును. దీనికితోడుగ మొదటిబిడ్డ తెలివిగలవాడై బడియందెక్కువ మార్కులను దెచ్చుకొనుటయు, రెండవవాడెంత కష్టపడినను సామాన్యముగనే యుండుటయు జరుగుచుండిన అతని (ఆ రెండవవాని) ద్వేషము మరింత హెచ్చును.

బిడ్డలకాదర్శప్రాయులగు వ్యక్తులుగా పెద్దవారిని జూపవచ్చును. లేదా కథలయందలి కల్పితపాత్రలను జూపవచ్చును. కాని మరియొకబిడ్డ నాదర్శప్రాయుని గ జూపుట ఎన్నటికిని పనికిరాదు. తోటివాని నెక్కువజేయుటచే అతనియెడ బిడ్డకు ద్వేషభావము గలుగునేగాని గౌరవభావమేమియు గలుగఁబోదు.

పైసందర్భములలో బిడ్డజూపెడి వైరభావమొక రిద్దరి యెడలనే కావచ్చును. కాని ఆ భావమునే అతడితరుల యెడలను జూపనారంభించును. కారణ మేమన అతనికిగలిగిన విచారమును భద్రతలేమియు, అతనిభావోద్రేకములను కలవరపరచును. ఆ కలవర మునే అతడెన్నోరీతుల వెలిబుచ్చుచు వైరవృత్తిని జూపుచుండును. బిడ్డడీవిధముగ వైరభావమును జూపు చుండిన అతనికి సరియగు నమ్మికయు, భద్రతభావ మును కలిగింప ప్రయత్నింపవలెను. అట్టి ప్రయత్న ముచే అతడితరులయెడ వైరముజూపుట క్రమముగ మానగలడు.

తల్లిదండ్రుల యధికారమెక్కువగుటచేగూడ బిడ్డ కలహగుణమును జూపగలడు. అతనియెడ నోర్పు జూపకున్నను, ఎల్లప్పుడతని నవమానించుచున్నను, ప్రశంశించుటకన్న దండించుటయే యధికమైనను అతడితరులకు బాధాకరముగ ప్రవర్తించుచుండును. ఇది తల్లిదండ్రులకును, ఉపాధ్యాయులకును తెలియని విషయముగాదు. ఐననువారు తమ తప్పులను గ్రహింప కుండుట ఎంతయు నాశ్చర్యకరము.

కొందరు బిడ్డలింట కలహించుచు బడిలో సరిగా నుందురు. మరికొందరు బడిలో బాధించుచు నింట సరిగానుందురు. ఈ విధముగ పిల్లలుండుటకు తలి దండ్రుల యధికార మెక్కువగుటయే కారణమగును. తల్లిదండ్రుల యధికార మెక్కువగుట దండనలవల నను, భయమువలననేగాక భావోద్రేకముల యొత్తిడి వలనగూడ కాగలదు. "తండ్రీ నీవాపనిని చేయలేవు. నీ చిన్నిచేతులు కష్టపడుట నేజూచి భరింపజాల"నని తల్లి భావోద్రేకములను వెలిబుచ్చినపుడు బిడ్డ విధే యత జూపవచ్చును. కాని యది తల్లినర్థముజేసికొను టచేకంటే ఆమెను విననిచో గలిగెడిరచ్చను భరింప లేకయే కావచ్చును.

కొందరు బిడ్డలు అందరియెడలను వైరముజూపక ప్రత్యేకవర్గములకు (groups) జెందిన వ్యక్తుల యెడ లనే జూపుచుందురు. అట్టి బిడ్డలు పెద్దలతో కలసి యుండిన పిల్లలతో కలయకుందురు. పిల్లలతో చేరియుండిన పెద్దలతో కలహించుచుందురు. ఇందు లకు కారణములేవన,

1. అట్టి వ్యక్తులలో నొకనివలన బాధగలుగుట, (ఆ వ్యక్తి పెద్దపిన్నలలో నెవరైననుకావచ్చును.)

2. పెద్దలతోగాని లేదా పిల్లలతోగాని తరచుగ మెలగకుండుట.

పెద్దలతో నెక్కువగా చేరియుండెడుబిడ్డ పిల్లలతో నాడుకొనుట తెలియక వారితో కలహించుచుండును. ఇది నిజమునకతడు తన భద్రతలేమిని జూపుటయే కావచ్చును. అతనికొకబిడ్డవలన నెన్నడో ఎక్కువబాధగలిగి బిడ్డలందరియెడ నొకవిధమగు వైరభావము జనించియుండవచ్చును. ఒకప్పుడొక యొంటిబిడ్డ నింకొకబిడ్డకడకు దీసికొనిపోగా ఆబిడ్డ అతనికి తనయాటవస్తువునీయకకొట్టెను. అప్పటినుండియు కొన్ని నెలలవరకు నా యొంటిబిడ్డ మరియొకబిడ్డనుచేరకుండెను.

సమవయస్కులగు నితరపిల్లల సాంగత్యము బిడ్డకెంతయు ముఖ్యము. అతడితరపిల్లలచేరకుండుట కేదో కారణముండును. దానిని తెలిసికొని అతని మనోభావములనుసరిచేయ ప్రయత్నింపవలెను. మాటలవలనను, దండనలవలనను నెట్టిప్రయోజనమును గలుగబోదు. బిడ్డస్వభావము మారవలెనన్న దానినిగూర్చి అతనియెదుటనే ముచ్చటింపరాదు. గమనింపనివిధమున నూరకుండుటయే చాలమంచిది. అతడితర పిల్లలచేరనియెడల అతనిని జూచుటకై మరియొకబిడ్డను రప్పించవచ్చును. లేనిచో నతనినే మరియొకబిడ్డకడకు గొనిపోవచ్చును. కాని యాబిడ్డతోనాడుకొమ్మని యతనిని నిర్బంధింపరాదు. మరియొకబిడ్డతో కలసియుండుట కిచ్చగించుటయేచాలును. ఇక మన మాతని నా బిడ్డతో నేకాంతముగనుండనిచ్చిన నేదో విధమున వారిరువురును పరిచయంజేసికొనగలరు. ఇట్టి సందర్భమున పిల్లలతోనాడుచు వారి క్రొత్తదనమును పోగొట్టగల పెద్దలైనను పెరిగిన పిల్లలైనను చాల సహాయకరముగ నుండగలరు.

బిడ్డ పెద్దలయెడ వైరముజూపునపుడును పైపద్ధతినే యవలంబించి గమనింపని విధమున నూరకుండవలెను. నమస్కరింపుమనుటయు, ఏవో మర్యాదల జూపుమనుటయు పనికిరాదు. వచ్చినవారిని జూచుటకై బిడ్డను రానీయవచ్చును. కాని యతనిరాకను గమనింపనిరీతిగ నూరకుండవలెను. చాలమంది పెద్దలు ఇతరుల పిల్లలతో సరిగా ప్రవర్తింపకుందురు. వారిని ముద్దుబెట్టుకొని బాధింతురు. లేదా వారిని కరుణించి దిగివచ్చినరీతిగ ప్రవర్తింతురు. ఇది బిడ్డలకెంతయు కోపమును గలుగజేయును. పిల్లలు చిన్నవారైనపుడు వారే, మనవద్దకువచ్చువరకు, గమనింపని విధమున నూరకుండవలెను. పెద్దపిల్లలైనచో వారిని బుద్ధిగల వ్యక్తులుగాజూచుచు పెద్దజేయవలెను.

ఏకారణమువలనగాని బిడ్డపెద్దలయెడలనో, పిన్నలయెడలనో, లేదా పెద్ద పిన్నలిరువురియెడలనో వైరముజూపుచుండిన దానిని సవరించుట కెంతో యోర్పును జూపవలెను. ఓర్పును జూపుచో బిడ్డ ఆరునెలలో బాగుపడగలడు. లేదా ఇంకను కొంత కాలముపట్టవచ్చును.

## ఇతరులపై నాధారపడియుండుట :—

పసితనమున బిడ్డ తన యవసరములను కనుగొని దీర్చుచుండెడి పెద్దవారిమీదనో పెరిగిన పిల్లలమీదనో నెక్కువగా నాధారపడి యుండును. కాని 1½, 2 సం॥ వయస్సు రాగానే అతడితరులపై నాధారపడక తన పనులను తానే జేసికొన గోరుచుండును. అట్టియెడ మన మాతని నాటంక పరుపక స్వతంత్రముగా నడచుకొనుటకే ప్రోత్సహింప వలెను. లేనిచో అతడెదిగియు నితరులపై యాధారపడెడి స్వభావమునే జూపుచు ఇతరులుండుట తన కోర్కెలను కష్టములను దీర్చుట కొరకేయని తలంచుచుండును. ఇట్లు తలంచుచుండుటచే అతడేపనిని స్వయముగ జేయలేననుచు ఒరుల సహాయము నరయుచుండును. ఒరులపై నాధారపడెడి స్వభావము సాంఘికముగ సరియైయుండదు. దీనిచే సంఘములో కొందరు సోమరులై ఇతరులను కష్ట పెట్టగలరు.

## మాతృత్వమును జూపుట (Mothering):—

పెద్ద పిల్లలు తమకన్న చిన్నవారియెడ మాతృత్వమును జూపుచుండుట మనము గమనించుచునే

యుండుము. ఇట్టి భావమును మగపిల్లలకన్న ఆడుపిల్లలే తరచుగ జూపుచుందురు. బిడ్డ లిట్టి భావమును జూపుట ప్రశంసనీయమేయైనను దానికిగల కారణమేదో తెలిసికొనుటయు ముఖ్యమగును. ఏ బిడ్డయైనను మరియొక్క బిడ్డయెడ మాతృత్వము జూపగోరుట రక్షకగుణ మెక్కువగుటచేతనే కానక్కరలేదు. ఆ బిడ్డ జీవిత పరిస్థితులుండవలసిన తీరున నుండకుండుటయు కారణమే కాగలదు. ఒక్కొక్కప్పుడు తల్లి తన బిడ్డ నెక్కువగా సంరక్షించుచు స్వతంత్రముగా నుండనీయకుండును. అప్పుడా బిడ్డ మరియొక బిడ్డను సంరక్షించుచు తానును తన తల్లివలె నుండగలిగితినని తృప్తిని బొందును. కాని యీ విధమున నొక బిడ్డ మరియొకనిని సంరక్షించుట ఇరువురకును శ్రేయస్కరము కాజాలదు. వీరిలో పెద్దబిడ్డను ఇతరులపై యధికారమును, హక్కును జూపవలెనను కోరిక బుట్టి దుఃఖకారణమగుచుండును. చిన్న బిడ్డ యెదిగియు పసివానివలె నితరులపై నాధారపడుచుండును. స్వేచ్ఛ స్వభావుడైన నితరులతో కలహించు చుండును.

ఎదిగిన బిడ్డ యొకతె పైజెప్పిన రీతిని తన యధికారమును జూపుచున్నపుడు కారణమేదో కనుగొని తొలగింప ప్రయత్నింప వలెను. ఆ బిడ్డ కిష్టమగు పనులను, బాధ్యతలను కల్పించి ఆమె యధికార భావమును సక్రమ రీతిని సంతృప్తి పరుపవలెను.

**లజ్జ, బిడియము (Shyness and Diffidence):-**

బిడ్డలలో కొందరు చాల సున్నిత స్వభావులై యుందురు. వారిలో నహంభావము (Assertive nature) తక్కువగా నుండును. అట్టివారిని కడు జాగ్రతతో జూచుకొనవలెను. లేనిచో వారంతర్ముఖులై (Intravorts) ఇతరుల జేరకుందురు. అంతర్ముఖు లెల్లపుడు నేదో యాలోచించుకొనుచు, కలలుగనుచు, తమలోతామే యానందమును బొందుచుందురు. అట్టివారికి ఇతరులతో చేరుట అంత యానందకరముగ దోచకుండును. పెద్దలుగాని, పిల్లలుగాని ఊరక బిడియను జూపరు. అందుల కెన్నో కారణములుండును. బిడియ పడెడివారందరు ఇతరుల చేరగోరరని తలంపరాదు. ఒక విధమగు జంకును, తక్కువ భావమును (Inferiority) సులభముగా సంభాషింప జాలకుండుటయు, తా మితరుల కక్కరలేదనుకొనుటయు, తమ్మితరులిష్టపడ జాలరను తలంపును కారణములై వారితరుల జేరకుందురు. అట్టియెడ నితరులే వారిని చేరవచ్చినవారెంతయు ముఖత జూపగలరు.

బిడ్డ సిగ్గుపడుచున్నపుడు అతని బిడియము నెక్కువ జేసెడి పరిస్థితులను కనుగొని తొలగింప ప్రయత్నింప వలెను. అతని సిగ్గును గూర్చియు, పిచ్చియలవాట్లను గూర్చియు (Mannerisms) చర్చింపరాదు. 'కొందర పడి అతనిని విమర్శింపరాదు, ఇతరులతో పోల్చరాదు. అతడు చేయనగు నే పనినైనను స్వయముగ జేయ ప్రోత్సహించుచు ఆత్మ విశ్వాసమును పెంపొందింపవలెను. బిడ్డ బిడియమును బోగొట్టుటకు ఇతర పిల్లలతో నతనికి సంబంధము లేర్పరచుటయు నవసరమే యగును. ఐనను అతనినందరితో పాటుగనే గ్రూపులోనో చేర్చుటపనికిరాదు. అతనికి తగిన మరియొక బిడ్డతో పరిచయముచేయుట మంచిది. గ్రూపులో చేర్చితిమేని ఎట్లు ప్రవర్తించుకొనవలెనో యెరుగక అతడు బాధపడగలడు. లేదా గ్రూపు నందలి పిల్లలతనిని గమనింపక విడువగలరు.

బిడ్డ బిడియమునకు అతని దుస్తులుగూడ కారణమగుచుండును. తోటి పిల్లల దుస్తులవలెగాక తన దుస్తులెంతో వేరుగ నగుపడుచుండెనేని, బిడ్డ, బాధను సిగ్గును బొందుచు బిడియము జూపును. అట్లు బిడియ పడుటలో నర్థము లేదని మన మెంత జెప్పినను ప్రయోజనముండదు. బిడ్డలలో 'మంద' గుణ మెక్కువ. అది మాటలతో పోవునదిగాదు. తోటి పిల్లలెట్టి దుస్తులు ధరింతురో తానును అట్టివానినే ధరింపవలెనని బిడ్డ తలంచును. వేరు దుస్తుల ధరించుట వారినుండి వేరగుటయే యనుకొనును. తల్లిదండ్రులిది గ్రహించి అతనికి తగిన దుస్తులను తొడుగవలెను.

**సాంఘిక ప్రవృత్తులపై ప్రభావముగల ఇతర పరిస్థితులు (Other factors influencing**

social attitudes) ఇంటి పరిస్థితులు:-

కుటుంబములో నైకమత్యమును ఏకీభావమును లేని యెడల బిడ్డల దృక్పథము సరిగా నుండజాలదు. తల్లిదండ్రులొండొరులతో నెల్లప్పుడు కలహించుచున్నారనుకొనుడు. లేదా ఒకరియెడ నొకరికి ప్రేమయు స్నేహ భావమును లేక యున్నారనుకొనుడు. అట్టి పరిస్థితులలో బిడ్డ మనముపై నొత్తిడి కలుగుట తప్పదు. అప్పుడతడు తల్లివైపుననో తండ్రివైపుననో చేరి తన కనుకూలమగు విధమున వారి నుద్రేక పరచుచుండును. తల్లిదండ్రు లిరువురు నతనికిష్టులేయైనప్పుడు ఎవరిమాట వినవలెనో తోచక తల్లడ పడును. ఈ విధముగ గలిగెడి మనోవేదన నాతడు తన స్వభావానుగుణముగ నెన్నో రీతుల వెలిబుచ్చుచుండును. అత డెదిరించుచు "వైరము" జూపగలడు. లేదా జంకును సంకోచమును జూపగలడు. అట్లుగానిచో తన స్వభావానుగుణముగ నలక్ష్యము జూపుచు వస్తువులను పాడుజేయగలడు. కొందరు బిడ్డలు తల్లిదండ్రుల కలహము నూతగొని తమ యాటల సాగించుకొను నేర్పు నలవరచుకొందురు. తల్లిదండ్రులలో నొకరతి కఠినులును మరియొకరతి సౌమ్యులును ఐయుండిరేని బిడ్డలు పై విధమున ప్రవర్తించుచుందురు. ఈ ప్రవర్తనను వారింటి యందేగాక బయటి సంఘమునందును జూపుచుందురు.

## కుటుంబములో బిడ్డకుగల స్థానము

(Child's place in the Family)

కుటుంబములో బిడ్డలకుగల స్థానములను బట్టికూడ వారి సాంఘిక ప్రవృత్తులేర్పడు చుండును. ఒంటి బిడ్డ (Only Child), మొదటి బిడ్డ, చివరి బిడ్డ, నడిమి బిడ్డ, మగ పిల్లలలో నాడు బిడ్డ, ఆడు పిల్లలలో మగబిడ్డ—వీరి పరిస్థితులను పరికించిన ఇంటి యందు వీరికిగల స్థానములనుబట్టి సాంఘిక ప్రవృత్తులెట్లేర్పడునదియును మనకు బోధపడగలదు. ఏకీభావము, ఐకమత్యము, పరస్పరానురాగము అన్యోన్యతయు బాగుగానున్న కుటుంబమున బిడ్డ స్థానమెట్టిదైనను అతని శీలము సరిగానే యుండును.

(సశేషము)

# దేశీయ గీతం

శ్రీమతి కనకదుర్గారామచంద్రన్, యం. ఏ., యం. యిడి.

ఓ భారతవీరకుమారా! వినుమా!
భారతమాత - భావిసుభముకై
బయలు దేరుమా - బహు ఉత్సాహముతో
మానవబాధ్యత మరువకుమా ॥ ఓ ॥

దేశఋణముధీరా! తీర్పుమా
దివ్యఖ్యాతియె - దిగ్విజయమా ॥ ఓ ॥

ఊదుమా - శాంతిశంఖము
కొట్టుమా - జయభేరి,
గానంచేయుమా - దేశీయగీతం ॥ ఓ ॥

స్వార్థమువదలుమా - సార్థకమెరుగుమా,
సంఘజీవితం - సంస్కరింపుమా,
జాతిభేధముల - జారవిడువుమా,
మానవసేవా - మరువకచేయుమా,
స్వదేశశాంతియె - సకలాధారమా ॥ ఓ ॥

గ్రామవాసుల - గరిమసమస్యల,
గ్రక్కునతీర్పుమా - ఘనమైనసేవచే ॥ ఓ ॥

కుటిలభావముల - కూలద్రోయుమా
కృత్రిమవిభజనల - ఖండింపుమా ॥ ఓ ॥

కృషీవలుల - కార్మికకూలీల
కటికబీదల - కాయకష్టుల
కనికరముతో - కాపాడితీరుమా ॥ ఓ ॥

మహిళామణుల - పసిపాపల
దయతో జూడుమా - దొడ్డబుద్ధితో
జీవితరంగం - జ్యోతిమయం చేయుమా ॥ ఓ ॥

ప్రపంచజీవితం - ప్రయాణమే గదా !
కాలచక్రము - గడచిపోవునుగా !
తోటిజీవుల - దురితముల బాపుమా
ప్రేమదీపముల - వేగ వెలిగింపుమా ॥ ఓ ॥

# స్త్రీ విద్య : ఉద్దేశ్యము

రచన :
శ్రీమతి మహాదేవివర్మ

అనువాదం :
శ్రీసత్యనారాయణాచార్య

స్త్రీల ఆదర్శగృహజీవితనిర్మాణమే స్త్రీ విద్య ముఖ్య వుద్దేశ్యం. వారిని గృహస్థ జీవితానికి దూరం చేయుట సరికాదు. దుర్గ, సరస్వతీ స్వరూపిణులగుటచే స్త్రీలలో పాశులిక ప్రవృత్తులను జయించు క్షమత్వంకలదు.

వాస్తవంగా ఆరోగ్యవంతమైన సుఖసంపన్న గృహజీవిత పథకమే విద్యోద్దేశ్యం. కాని నేటి బాలికలు విద్యావతులై, తమకు మంచి వుద్యోగం, కారు, బంగళాకలిగి విద్యాధికుడు, ధనికుడగు భర్తలు కావలెనని కోరుతున్నారు. భర్త రూపవంతుడై వుండుట కూడా ముఖ్యం. ఈ మనః ప్రవృత్తి అత్యంతదూషిదమే కాక లజ్జాయుతమైనదికూడా.

నేడు మనం రాజకీయ స్వాతంత్ర్యాన్ని పొందాం. ఇక మిగిలింది సాంఘిక స్వాతంత్ర్యాన్ని పొందడం. నేటివరకు సాంఘికంగా అనేక మార్పులు జరిగినై; అయినా ఇంకా జరగవలసివున్నయ్. మన సమాజం ఆర్థికచిక్కులనుండి విముక్తిపొందడంకూడా అలాగే మిగిలివుంది.

రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్, ప్రధాని నెహ్రూజీలు మన అభ్యున్నతిని అభిలషిస్తూ, సామాజికంగా మన కనుకూలమగు విద్యావిధానపు ఆవశ్యకతను గురించి నొక్కి పలుకుచున్నారు. ఒక సంస్థను నడుపుటకు తగిన యోగ్యతలు, కుటుంబ వ్యవహారములు చక్కదిద్దు సామర్థ్యంవున్నట్లయితే, ప్రతి ఒక్క స్త్రీ బాధ్యతాయుతమైన సంస్థయేకాక కుటుంబవ్యవహారాలకు కేంద్రబిందువన్నదే నా దృఢాభిప్రాయం, పురుషులు పదిమందైనా నిర్వహించలేని కుటుంబవ్యవహారాల్ని స్త్రీ ఒక్కతే సరిపెట్టుకోగలదు. కనుకనే గృహజీవితానికి స్త్రీని దూరంచేయుట సరికాదు. అయితే కుటుంబ నిర్వహణతప్ప స్త్రీ దేశీయ నిర్మాణ కార్యక్రమాలో సహకరించరాదని దీని భావంకాదు. సమాజాన్ని పరిపోషించు స్త్రీయే మాతృదేవతని మన భారతీయ పవిత్ర ఆదర్శం. ఏ సాంస్కృతిక దేశంలోనైనా పురుషులు స్త్రీలను ఏ దృష్టితో చూస్తున్నారో తెలుస్తునేవుంది. గతవేద కాలీన చరిత్రవల్ల నాటి స్త్రీలు వైజ్ఞానికంగాను బౌద్ధికంగాను పురుషులతో సమానులని, సాంస్కృతిక చైతన్యంకూడా వారితో పరిపూర్ణంగా కలదని స్పష్టమౌతుంది. ఆనాడు స్త్రీలకున్నస్థానం నేడు లేదన్నదే నా అభిప్రాయం. ఈనాడు తమ హక్కుల్ని కోరడం ముఖ్యంగా కనిపిస్తుంది. పురుషులతోసహా సమానమైన హక్కుల్ని నేటి స్త్రీలు కోరుతున్నారు. ఈ హక్కులు ఒకరు కోరేవి మరొకరిచ్చేవికావు. కర్తవ్యభావనతో తమకు తాముగా సంప్రాప్తమౌతయి. స్థూలంగా ఆలోచించినట్లయితే స్త్రీ సర్వసంపూర్ణమైనదని బోధపడుతుంది. సకల సంపదలకు లక్ష్మిగను విద్యా బుద్ధులకు సరస్వతిగను స్త్రీ ఒప్పుకొన బడుటయేగాక, అధిష్ఠాన దేవతనిగూడా ఒక భావనవుంది. వీటన్నిటికీ కారణం స్త్రీలోగల సహజ క్షమత్వమున్నది మన మెన్నడూ మరువకూడదు. కనుకనే కోరినంత మాత్రాన హక్కులు కలుగవు. యోగ్యులగు వారి హక్కులను ఎవరూ లాక్కోలేరు.

నేడు మన సాంఘిక సమస్యలను పరిష్కరించగల విద్య ఎంతో అవసరం. చైనా రష్యాలలో స్త్రీలు నేడు ప్రయోజకులుగా కనిపిస్తున్నారు. వారచ్చట శ్రమించుటమేకాక, తమ సమాజపు బాహ్యాంతర్గత రూపములను సరిదిద్దు సంపూర్ణయోగ్యతలు వారిలో కలవన్నది నిస్సందేహం. మనదేశ స్త్రీలుకూడా అలాగేచేయాలి. కాని మన స్త్రీలు బాహ్యరూపానికి ముగ్ధులూ వశీభూతులై, అంతర్గతంగా ప్రభావితులు కాలేకపోతున్నారు. ఒక విద్యావతి విద్యా

గంధంలేని అవిద్యావతిని దరిచేరి, ఆమెతో మాట్లాడటం అవమానమని భావిస్తుంది. ఇది చాల చెడ్డ సంగతి. ఈ మనః ప్రవృత్తి వ్యక్తిగతంగా వారికే గాక, సమాజగతంగాచూచినా అత్యంత వినాశకారి యని స్పష్టమౌతుంది.

విద్యావతియగు నేటి స్త్రీ ఎచ్చటికైనా వెళ్ళు ముందు లిప్‌స్టిక్, చేతిగాజులు, ధరించిన చీర సరిగా వున్నవో లేవో ముఖ్యంగా ఆలోచిస్తుంది. వాస్తవంగా యీ బాహ్యాడంబర జీవితం మనకు తగదు.

మనలోగల వ్యర్థమైన హేళనా అవమానభావాలు మొదలంటాపోవాలి. స్త్రీ సమాజ సర్వతో ముఖవికాసానికి మనం పనిపూనాలి. ఒకమాట; - నాకు కొందరు రాస్తూ "మమ్మల్ని కూడా అవమానపరిచే వారిని గురించి మీ రేమీ రాయరేం?" అంటున్నారు. దానికి జవాబుగా యిలా చెప్పదలిచాను; - మన భారతీయ పురుషుల జీవితం బ్రహ్మచర్యానికి సంబంధించినట్టిది. కనుక అతడు భార్యకు భర్తగను, తనయునకు తండ్రిగను వ్యవహరిస్తున్నాడు. కాని నా అభిప్రాయం ప్రకారం ఏ స్త్రీకిని ఏ స్త్రీ రక్షా బంధనానికి పురుషుని హస్తంభారం, కఠోరం కాజాలదు. అతనిలోగల పాశవిక ప్రవృత్తులు స్త్రీలోగల సహజకోమలత్వానికి తలవంచితీరుతై. ఎవరైనా స్త్రీనిగాని, స్త్రీ సహజ కోమలత్వాన్ని గాని నిరాదరించినట్లయితే - అట్టివారుకూడా తమ మాతృశ్రీలకు తనయులేనని మనం మరువకూడదు. సోదరభావంతో మనం మగవారిని పిలిచి ఆదరించినట్లయితే, వారిలో మనపట్లగల హేతనా అవమాన భావాలు తమంతటతామే సమసిపోగలవు.

నేటి మన బాలికలపై యీ గురుతర బాధ్యత పడ్డది. జీవిత నివాసానికి తోడ్పడని విద్య సర్వదా వ్యర్థమైనదే. ఎన్ని సిద్ధాంతాలైనా ఆదర్శాలైనా - అవి మానవ జీవితంలో ప్రతిబింబించనంతవరకు, ఆ విద్య మానవ కళ్యాణానికి ఎంతమాత్రం ఉపయోగకారి కాజాలదు.

మన పాఠశాలలకు పాఠ్య పుస్తకాలు నిర్ణయించేటప్పుడు, మన బాలికల జీవిత సమస్యల కవి ఎంత వరకు సమాధాన మివ్వగలవో ఆలోచించాలి. గృహ జీవితంలో ఎదుర్కొనవలసిన కష్టాలను, ఆ పాఠ్య పుస్తకాలు ఎంత వరకు పరిష్కరించగలవో యోచించడంకూడా మన ధర్మమైవుంది. అత్యధిక సంఖ్యలో స్కూళ్లుగానీ బాలికల అవసరంగానీ మనకు లేదు. విద్యయొక్క పవిత్ర ఉద్దేశ్యాన్ని గుర్తించి తద్విధంగా నడచుకొనే విద్యావతులు - విద్యాలయాలే మనకు కావాలి! సీతాకోక చిలుకల్లా ఇటూ అటూ సంచరించే స్త్రీలు మనకవసరం లేదు. విద్యసముపార్జన ద్వారా మానసికమైన మార్పువచ్చి, సాంఘిక నిర్మాణం, దేశోన్నతి, స్త్రీ సమాజ అభ్యుదయానికి నిరంతరం సహాయపడే బాలికలే మనకు ముఖ్యంగా కావాలి. మన దేశంలో అట్టి విద్యావిధానం రానంత వరకు, మన జీవితమార్గం సరిగాలేక ఎగుడు దిగుడుగా వుండక తప్పదు.

మన స్త్రీలు కష్టనష్టాలకు గురికావడం, ఎప్పటికప్పుడు మన జీవితమార్గంలో అడ్డుకట్టలేర్పడడం మనకు తెలిసిన సంగతే. కాని జీవితంలో విద్యను ప్రతిబింబింప చేయడానికి అభ్యసించాలి; అదే గొప్పసంగతి. ప్రస్తుత కాలమే మనకు ఒక అగ్నిపరీక్ష. మానవత్వం మృగ్యమై పాశవిక ప్రవృత్తులు ప్రబలుతున్నయ్. వాటిని మంచి మార్గంలో పెట్టవలసిందికూడా స్త్రీలే. కనుక నేడు మన విద్యావిధానం వ్యష్టికేగాక సమిష్టికి కూడా సులభంగానుపయోగపడు రీతిగాను వుండాలి. అప్పుడు మన గార్హస్థ్య జీవితం సుఖపూరితంగాను ఆరోగ్యవంతంగాను వుండగలదు. చిరకాల వాంఛయగు "వసుధైవకుటుంబకమ్" దీనివలనేసంభవం కాగలదు. ఇంతగా చెప్పుకున్న తరువాత మనం అవలంబించే పద్ధతి క్రియాత్మకంగాను, సమాజిక సంకెళ్ళు తెంచేదిగను వుండాలి. దేశాన్ని, సమాజాన్ని, వ్యక్తిని కర్మపథంపై నడిపిస్తూ క్రియాశీలురను గావించే విద్యే దేశోపయోగమైన విద్య; అదే మనకు కావాలి. దానినే మనం అభిలషించాలి!

———o———

# కలసివచ్చిన కాలం

శ్రీ విద్వాన్ సాధన వీరస్వామి నాయుడు ఎం. ఏ.

1 వ రంగము

స్థలము:-పల్లెటూరిలో తలుపు తెఱచియుంచిన పూరియింటి ముందఱ.

కాలము:-దాదాపు మధ్యాహ్నము 12 గంటల సమయము:

[40 ఏండ్ల లోపల వయస్సు. పొలములో కష్టించి వచ్చు రైతు సుబ్బన్న ప్రవేశము]

సుబ్బన్న:-ఏయ్ !...(కొంచెమాగి) తలుపు తెఱచియుంది అమ్మా కూతురెక్కడికి పోయినట్టు ? (విసుగుతో) ఏఁవ్ ! చెవుడా! ఎండలో పొలాన కష్టపడి యింటికివస్తే యింటి యిల్లాలు ఏమి తొందఱగా ఎదురువచ్చి దప్పిక తీరుస్తుంది ? అబ్బా! (నిట్టూర్పు)

వెంకమ్మ:-ఏమండీ! వస్తున్నా. (భయమున సంభ్రమమున)

సు:-వస్తున్నానని పెండ్లి నడకతో రాగం తీస్తున్నావా ? కాస్త మంచినీళ్లు తీసుకరా. మగవాళ్ల కష్టమే తెలియదీ ఆడవాళ్లకు. (కోపముతో తలగుడ్డ తీసి విసరుకొనును). (సుబ్బమ్మ లోపలకు పోవును). (వెంకమ్మ చిన్న చెంబున మంచినీళ్ల నందిచ్చును. సుబ్బన్న త్రాగి ప్రక్క తిన్నెపై కూలబడి) పొద్దున సద్దిపోసి వచ్చాను. మిట్ట మధ్యాహ్నమయింది. కష్టించి యింటికి వస్తే పలికే దిక్కేలేరు. నీ కెప్పుడా పొయ్యితోనే. (కోపముతో) ఆ పిల్ల దేదీ ?

వెం:-(భయమున) నేనొక్కదాన్నే యింటి పనులు చేసికోవలసివచ్చా. ఊరికంతా ఒకే బావి. అందులో ఈ ఎండాకాలములో నీళ్లసలే లేవు. వంతుల ప్రకారము ఆ నాలుగు కడవలు నేనొక్కతేనే తెచ్చేటప్పటికింత సేపయింది. ఇంక మీ రన్నాలకు వస్తారని ఆదరాబదరాగ పొయ్యి దగ్గఉంటిని అందుచే మీ కేక వినలేదు. పొరబాటయింది.

సు:-నీ వొక్కతేనంటావు - అమ్మాయి ఎక్కడికి పోయింది ? ఈడొచ్చిన దాన్ని యెవరింటికిపోవద్దని చెప్పలేదా!

వెం:-అవును. మన అమ్మాయి కూడా పోనన్నది. నాకూ ఇష్టములేదు - కాని

సు:-కాని ... గద్దవచ్చి తన్నుకొని పోయిందా ? ఏమిటే నీ అయోమయము ?

వెం:-ఏమిలేదు. అమ్మాయితో చిన్నప్పటి నుండి చదువుకొన్నది - కల్యాణి మన

మునసబుగారి కూతురికి తేపు శ్రీ వెంకటేశ్వరస్వామివారి సన్నిధిలో పెండ్లి గాదండీ! ముందుగ ఈ ప్రొద్దే పెళ్లి కూతురిని తీసుకొని పోతారట! ఆ అమ్మాయే నేరుగా మనయింటికి ప్రొద్దున వచ్చింది. ఒక టేపట్టు పట్టింది పెళ్లికి తిరుపతికి రమ్మని.

సు:-ఆఁ... కాశీ రామేశ్వరముకూడా ఊరేగించు.

వెం:-ఊరికనే కోప్పడుతారు.

సు:-లేదులే – నీ ఏడ్పు కానీ.

వెం:-ఈ ఏడ్పులకు భయపడే నా తల్లి యిల్లు గడప దాటననినది...కల్యాణి కళ్ల నీళ్లు పెట్టుకొంది. ఇంటి దాక రమ్మని బ్రతిమలాడింది. పసుపు కాళ్లతో పోతుంది. దాని అచ్చట ముచ్చట ఎట్లుందో? నేనే పొమ్మని మన రాధ నంపినాను.

సు:-రాధనంపినావు (విసుగు) దాని బాధ నీకేమి తెలియును? ఆడుదానవై పుట్టావు!

వెం:-మొగాళ్లు మీరున్నారు. ఆడవాళ్లు మేమేం చేసేది?

సు:-అందఱూ మొగాళ్లమే. గ్రామమునసబు పేరంటే ఊళ్ళోహడల్. పొలాల్లో చెట్టుచేమ, కసవు గట్ర, చెఱువులో చేపలు——అన్నీ ఆయనవే! అప్పచెల్లలు మొగుడుచచ్చి యింటిమీద ఇల్లువచ్చి పడింది! ఊళ్లోవాళ్ల వెట్టి చాకిరితో పుట్లకు పుట్లు ధాన్యం పండిస్తారు. పుట్టికేదుము లెక్కను సాలుకు రెండు నాములు తీస్తాడు. ఆయనకేం కుబేరుడయ్యాడు! ఈ పాపాలు కడిగేసుకునేందుకు వెంకటేశుని ముందఱ కొమార్తెకు పదివేల రూపాయల కట్నమిచ్చి పెండ్లి చేయించి యిస్తున్నాడు.

వె:-అవునండీ వెంట్రుక లున్నమ్మ ఏ కొప్పయినా పెడుతుంది.

సు:-మనగతి?

వెం:-ఏదో మనకు తగినవాళ్లు మనకుండరండీ? మీదంతా చోద్దెం!

సు:-చూస్తున్నావుగా మనబిడ్డ యీడేరి ఏడాది అయింది. ఏరీ మనకు తగిన వాళ్లు? ఒక్కరైనా వచ్చారూ?

వెం:-అంతా వస్తారు. మన బిడ్డకేంతక్కువ? అందాల రామచిలుక! ఈ కాలానికి తగినట్లు చదువుకొన్నది. సినిమా పాటలు పాడుతుంది. పల్లెటూరికి పట్నవాసానికి పనికి వస్తుంది.

సు:-అన్నీ ఉన్నవి. అల్లుడే తక్కువ (నిట్టూర్పు).

వెం:-ఔను ఊరకే వస్తాడా యీ కాలం అల్లుడు? అధమపక్షం ఒక సైకిలో... చేతి గడియారమో అయినా యివ్వద్దా?

సు:-ఆఁ సరే. అప్పుడే అల్లుడిగారికి వకాల్తా పుచ్చుకొన్నావా? నీ యిద్దతే కొడుకుల నే గంగలో త్రోస్తావు? ఇంకా పుట్టే పిల్లలకు?

వెం:-(సిగ్గుతో) వాళ్లు మొగాళ్లు. వాళ్ల తెక్కలపైన వాళ్లు బ్రతుకుతారు... ...ఆఁ...జ్ఞాపకానికి వచ్చినది. వారికి కట్నాలు రావటండీ?

సు:-వస్తాయి - ఎప్పుడో పళ్ళు పోల్లుకొని వస్తాయని యిప్పుడే చెఱువుకట్ట తెగవేయమంటావు. ఉన్న కాస్త కట్నమిచ్చి అడుక్కుతింటే— అల్లుడాదరిస్తాడా?

వెం:-ఏమండి నే నంత తెలివి తక్కువదాన్నా? నలుగురాడిన ఆట మన మాడకపోతే మనబిడ్డ గతి?

సు:-ఏమో దానిగతి యెట్లున్నదో? ఈ కలివు కాలములో మన తెక్కలాడితే గాని డొక్కలాడడము లేదు.

వెం:-భయపడకండి. అన్నిటికీ వెంకటేశుడే ఉన్నాడు. లేవండి భోజనానికి (అవనిక)

2-వ రంగము

స్థానము:- తిరుపతిలో ఒక పెండ్లి సత్రము.
కాలము:-రాత్రి.

[పెండ్లి జనము సందడి-మంగళవాద్యములు]

రామయ్య: అబ్బాయీ! పెండ్లికొడుకా! పెండ్లి పీటల మీదికి రమ్మంటున్నారు వారు. లగ్నము వస్తుందట.

వరుడు:-కట్నమేదండీ?

రా:-మునసబుగారు మాట తప్పరండి. ఇస్తారులెండి. మూడుముళ్లు కానివ్వండి

వ:-ఆ యిచ్చేది యిప్పుడే యివ్వమనండి- ఇంకా ఎప్పుడు ఇచ్చేది? మునసుబుగారయితే మాకేమి?

రా:-కోపపడకండి బాబయ్యా! శుభకార్యములు చల్లగా జరుగవలెను. నూఱు కాలాల పంట?

వ:-అవును కాబట్టే మా సంసారము చల్లగా నుండాలంటే ముందుగా కట్నమిచ్చి మాట నిలబెట్టుకోమనండి.

రా:-సరే లెండి. మునసబుగారూ! ఏరీ? లేరే. ఉక్కకు బయట వీధి యరుగున నున్నట్లున్నది. వారికీ సంగతి చెప్తా. (నిష్క్రమణము)

[మునసబు—రామయ్య ప్రవేశము]

మునసబు; ఏమి రామన్నా! పనులన్నీ జరుగుచున్నవా? మీరంతా చేతినిండా బలగమున్నారు పనులు చేయుటకని నేనిక్కడ కొంచెము ఆరుబయట గాలి మేయుటకు వచ్చాను. అబ్బే యిక్కడ వన్నీ బోడి మిద్దెలే. బోలెడద్దె పుచ్చుకుంటారుగాని సుఖమే లేదు. ఇదేనా తిరుపతి క్షౌరం!

రా:-చిత్తం. అన్నీ బాగానే జరుగుచున్నవి కానీ, చూచారా మీ యల్లుడిగారి ప్రవర్తన?

ము:-ఏమి రామన్నా ? నాకేమి రత్నము లాంటి పిల్లవాడు బి. ఏ. చదువు చున్నాడు.

రా:-అవును లెండి చదువునకు—సంస్కారానికి చాలదూరము లెండి పదిమంది సభలో మీ పరువు మర్యాదలు మంట గలుపు తున్నాడు.

ము:-(ఆశ్చర్యమున) ఏమీ - నా పరువు మర్యాదలా ? అప్పుడే ! ఏదో చెప్పేది సూటిగా చెప్పు.

రా:-ఏమీ లేదు. మీరిస్తామన్న పదివేల కట్నము వాడి మొగాన ఇప్పుడే పెట్టాలంట! పురోహితులు పెండ్లి పీటల మీదికి సన్నద్ధులుకండి అని హెచ్చరించగా ఈ యెదురు సవాలు చేస్తున్నాడు. ఏదో నక్క కొమ్ము దొక్కి మీ అల్లుడు కాబోతున్నాడు. ఇంతలో ఇంత గర్వమా ?

ము:-రామయ్యా ! అట్లనకు. రోజులు తల్లకిందులైనవి. ఎంతయినా ఆడ పిల్లలు గలవారము. అందులో శాస్త్ర కలవారము. అందుకే మనపైనకన్ను! మా కల్యాణికి యీడుజోడు కుదిరింది. పోనీ పద. ఇప్పుడే పైకం ఇచ్చేద్దాం.

రా:-ఏమి కాలం మండిపోతుందండి! మీరు లక్ష్మీ పుత్రులు కాబట్టి రెండు వేలు పెట్టి దేవేంద్రవైభవంగా నారంగా యని పెండ్లి చేయిస్తున్నారు. ఇప్పుడే కట్నము పదివేలు రూపాయిలు కాగి తాల కట్టలు పెండ్లి కొడుకు మొహాన పారేస్తారు. రేపు కొంపదీసి మాబోటి మధ్యరకపు కుటుంబస్తుల పీకలు తెగి పోతాయి బాబూ.

ము.-నీవు చెప్పేది నిజమే. ఇప్పుడు యువకులు-ముఖ్యముగా చదువుకొన్న యువకులు కట్నాలకు దాసులైపోతున్నారు. మా అంతస్తుకు ఇంత కట్న మియ్యకపోతే తగిన వరుడు రాడాయె. ఏం చేసేది రామయ్యా ? బిడ్డల కొఱకు ఇంత డబ్బు తెగ లేస్తుండాను.

రా:-అవును లెండి. తమవంటి వారికి వేలు దమ్మిడీలు. మాబోటివారికవే ప్రాణ సంకటాలు. ఏదో పులిని జూచి నక్క వాతలు వేసుకొన్నదట! అట్లా ఉంది మాగతి. సరే పురోహితులు తొందఱ జేస్తున్నారు. పదండి. పదండి లోపలికి. (తెర)

### 3-వ రంగము

స్థలము:-మొదటి రంగమువలె ఇంటిలోపల

కాలము:-సాయం సమయము.

[సుబ్బన్న - వెంకమ్మ ప్రవేశము]

సు:-ఏమే! నిన్న నేడు పెందల కడనే మోట కట్టాడా సేద్యగాడు ?

వెం:-ఏమో ? నేను సద్ది ఎత్తుకొని పొయ్యే

వేళకు మోటతోలుచుండినాడు.

సు: అవును ఈకొంపలో నేను లేకపోతే ఆ మాత్రము చీకటితో సేద్యగాడు పనికి వచ్చినాడా లేదా? గమనించేదిక్కే లేదు. మొగపిల్లలేమో పసికుఱ్ఱలు.

వెం:-సరేగాని మీరు పోయిన పని పండా కాయా?

సు:-నీకేమి తొందరతే?

వెం:- నాకు తొందరతే. ఎదిగిన బిడ్డకు ఎన్ని మనువులు! దాని స్నేహితురాలు కల్యాణికి కల్యాణమై ఆరు నెలలయింది. కానుపుకు మూడో నెలలో రాబోతుంది. మన అమ్మాయిని తలుచుకుంటే కడుపు తరుక్కుపోతుంది (స్వరభేదము)

సు:-ఏమిటే నీ కడుపుమంట? నీ కూతురికి పెండ్లి కాలేదనా? ఈ వరకు కట్నాల పోటీలో మన ఇల్లు-పొలము అమ్మినా మన అమ్మాయికి పెండ్లి చేయలేమేమో? (అని స్పృహతో)

వెం:-ఏమండీ అట్లా నిరాశగా మాట్లాడుతారు?

సు:-నిరాశగాక ఏమున్నది?

వెం:-ఇంతకు పిల్లవాని తల్లిదండ్రు లేమన్నారు?

సు:-ఏమంటారు? మింగను మెతుకులేక పోయినా మీసాలకు సంపెంగనూనె కావాలంటారు.

వెం:-అంటే వారేమి సంపన్నులుగారా?

సు:-అబ్బే మనకంటే కనాకష్టము! ఉన్న రెండెకరాలపై రెండువేలు అప్పు.

వెం:-అయితే అబ్బాయిని బస్తీలో ఎట్లా చదివించారండీ?

సు:-ఇదిగో మనబోటి ఆడపిల్లల కన్నవారిని వేటాడిచంపను. ఈ కాలంలో చదివించేవారికంతా ఇదే తెగులు. వాడేమో బీదవాడనని చెప్పుకుంటూ వారాలుతిని చదివాడట!

వెం:-బలే మంచి తెలివైనవాడే.

సు:-ఔను. తెలివైనవాడేలే!

వెం:-బీదవాడు కాబట్టే ఏదో ఉపాయంతో చదివాడుగదండి. ఎంతవఱకు చదివాడటండి?

సు:-ఇంటర్ చదివి పరీక్షతప్పాడట.

వెం:-అయ్యో పాపం! ఏదైనా ఉద్యోగములో ప్రవేశించకూడదా?

సు:-లేదట. ఈ పరీక్ష వెనుక ఇంజనీరింగు వెళ్లతాడంట.

వెం:-అదెన్నేళ్లు చదవాలండి?

సు:-ఐదేళ్లు.

వెం:-అమ్మో చాలకాలమే. అవునండీ ఇంజనీరు మంచి ఉద్యోగముకాదండీ?

సు: ఆఁ. చాల మంచిది. రెండు చేతులా సంపాదించుకోవచ్చు.

వెం:-అయితే మన అమ్మాయిని ఎట్లయినా యీ అబ్బాయికే యివ్వాలండి.

సు: బాగానేఉంది నీ పిచ్చి. అప్పుడే ఆయన ఇంజనీరయినట్లు – నీకు అల్లుడయినట్లు.

వెం:-ఏమండి అట్లా అంటారు ? ఇంత చదివించినవారు ఆ కొంచెము చదివించలేరూ ?

సు:-అఘోరించినట్లేఉంది నీ తెలివి. ఆ చదివింపులు మనం చదివించాలట. పెండ్లికి అదే షరతు. పై నెలలోనే మనమే పెండ్లిచేసి యివ్వాలంట. అప్పటినుండి పిల్లవానిని ఇంజనీరును చేయవలసిన బాధ్యత మనదేనట. ఏమంటావ్ ? నచ్చిందా ?

వెం:-చదువున కెంతడబ్బు అవుతుందండి ?

సు:-దాదాపు పదివేలవుతుందని తెలిసినవాళ్లు చెప్పారు.

వెం:-అమ్మో పదివేలే ? ఎన్ని జన్మాలకు సంపాదించేది ?

సు:-మరి ఇంజనీరే అల్లుడుకావాలంటివే ఇంతకుముందు ?

వెం:-మీా కెప్పుడూ వేళాకోళమే ? ఏదో మన బిడ్డకు తగిన కట్నమిచ్చి శాస్త్ర చదివినవాళ్లకు ముడిపెడదామనే ఆశతో అన్నాను. ఇదేమి తలకు మించిన కట్నాలండి ?

సు.-అవును. కాలస్వభావము నీకు తెలియలేదు. కాళ్లరిగేటట్లు ఎన్ని ఊళ్లు తిరిగాను ? చదువుకొన్న వరుడి గిరాకీ యిట్లా మండిపోతుంది ?

వెం:-అయితే ఏంచేదామండి ?

సు:-చేసేదేమిటి ? మనసుంటే మార్గమే లేదా ?

వెం:-అయితే ఎక్కడనో నిశ్చయముచేసికొని వచ్చారన్నమాట !

సు:-అనుకూలమైన స్థలమే. కాని నిశ్చయముచేయలేదు. అది మీారు అమ్మ-కూతురు అంగీకారముమీాద.

వెం: ఆడపిల్లభారము మోయలేమండి. ఈ చదువుకొన్నవారితో మనం వేగలేము. ఏదో మనమాదిరి మట్టిపిసుకుకొనేవానికే – మంచివాడయితే – యిచ్చేదామండి.

సు:-ఆలారా దారికి. నీవు చెప్పేది నిజమేనా ?

వెం:-ముమ్మాటికి నిజమే.

సు:-అయితే అమ్మాయి అభిప్రాయము కనుక్కో.

వెం:-దానికేం. సత్యకాలపుపిల్ల, దానికిది యిష్టమే. మన కష్టాలు చూడ

లేక నాకిదివరలోనే చెప్పింది

సు-అయితే మన అమ్మాయికీ శ్రావణ మాసములోనే పెండ్లి. నిన్న వస్తూ వస్తూ రామాపురములో మన పాత చుట్టాలు లే. మూడవతరములో కలసినారు. కోటప్ప కొడుక్కి మాట యిస్తామా?

వెం.-సరే పెండ్లయితే చాలు. కట్నమెంతో?

సు:-కట్నములేదు గిట్నములేదు. కట్నాలులేకుండా ఎలా పెండ్లిచేసి చూపిస్తానో చూడు!

వెం: నిజమేనా?

సు:-తప్పకుండ మీ యనుమతికొఱకే తిరిగి వచ్చాను. రేపుదయమే రామాపురము వెళ్ళి ముహూర్తము పెట్టుకుంటాము.

వెం:-అబ్బా! ఎన్నాళ్లకు కాలం కలసి వచ్చిందండి!

---

ఒకాయన తన 10 ఏళ్ల మేనల్లునితో "చెల్లాయికి బళ్లో యిన్ని బహుమానాలువస్తే నీకు కనీసం ఒక యోగ్యతాపత్రమైనా లభించనందుకు నీవు సిగ్గుపడాలి" అన్నాడు,

"లేదుమామా! నాకు ఒక యోగ్యతాపత్రము వచ్చింది."

"ఎప్పుడు? - ఎందుకుగాను?"

"నేనీ లోకంలో పుట్టినందుకు"

♦ ♦ ♦

ఒక ఉపాధ్యాయుడు తరగతిలో పాఠము చెప్పుతూ విద్యార్థులను "ఘనీభవించని ద్రవపదార్థము నొకదానిపేరును మీలో ఎవరైనా చెప్పగలరా" అని అడిగాడు.

ఒక బాలుడులేచి "నేను చెప్తానండీ! - వేడినీళ్లు" అన్నాడు.

♦ ♦ ♦

ఒకాయన తన చిన్న కుమార్తెను "మనం భగవంతుడు మన అపచారములను క్షమిస్తాడని ఆశించే ముందు మనమేమిచేయాలి?" అని అడిగాడు.

"ముందు మనము పాపంచెయ్యాలి" అని అన్నది పిల్ల తటపటాయించకుండా.

---



# అశ్రుతర్పణం

'పద్మ - నరేశ్'

(గతసంచిక తరువాయి)

"ఏమంతకోపం? మీ ముఖంలోని విషాద గీతల్లోని కాంతి రత్నం మెరిసిపోతున్నాదే" అంది హేళనగా.

"ఏమిటి సుందరీ! ఈ రోజు హద్దుమీరి మాట్లాడుతున్నావ్."

"నా మాటలేమీ హద్దుమీరడంలేదు. మీరే ఎందుకో ఈ వేళ కోపంగావున్నారు. సరేగానీ! మీ క్లాసులో గీతారత్నం ఎవరండీ?" — నాగేష్ ముఖంలో కలవరం బయలుదేరింది.

"సుందరీ! అర్ధముండే మాట్లాడుతున్నావా? మా శిక్షనులో ఆడవాళ్లు లేరన్న సంగతి నీకు తెలుసుగా!"

"అంటే మీ శిక్షనులో కాదులెండి! ఎస్. ఎస్. ఎల్. సి. లో" అన్నది.

"సుందరీ! నీ వైఖరి పూర్తిగా మారింది."

"ఆ! నా వైఖరో, మీ వైఖరో యింకా తెలుసుకోలేకుండా యున్నారు. గీతను అన్యాయం చేశారు. కాదంటారా? అప్పటినుండి ఆమె కుమిలిపోతూంది. కాళ్లమీదపడితే విదల్చేశారు. అన్యాయం చేశారు."

"సుందరీ! నీకివన్నీ యెవరు చెప్పారు. వాటితో నీకు జోక్యం అనవసరం."

"ఆ! మీ మాటలు మీ తెలివి తక్కువను వ్యక్తపరుస్తున్నాయి. ఇదేనా మీ పౌరుషం. అమాయకంతో నిండివున్న వారిని అన్యాయంచేసి మూలల్లో తిరుగుతారా! మీ మగతనం యింతేనా? ఛా! మీదీ ఓ బ్రతుకేనా! మీ మాటలతో నాకు జోక్యం లేదంటారా?"

"ఆగు! నేనిక్కడికి వచ్చినప్పటినుండి నీవు మితిమీరి మాట్లాడుతున్నావు."

"నేనా! - క్షమించండి. మీరిక నాతో మాట్లాడక్కర్లేదు. మీకూ నాకూ ఈ నాటితో ఋణం తీరిపోయింది."

"సుందరీ! నన్ను గురించి చెడ్డగా నీ కెవరో బాగా నూరిపోసినట్లుంది. ఆవేశంతో అర్ధంతెలీకుండా మాట్లాడుతున్నావు. నేనెవ్వరికీ అన్యాయం చేయలేదు."

"చేయలేదూ పాపం! గీతారత్నం యెవరివలన చెడిందో! నేనూ మీ వలలోపడ్డాను. కానీ దైవం రక్షించాడు. ఇక మీరు దయచేయవచ్చు" అంటూ కోపంతో యింట్లోకి వెళ్లిపోయింది.

నాగేష్ యిక అక్కడ నిలువలేకపోయాడు. ఎఱ్ఱబడిన కళ్లతో చరచర సుందరి యింటినుండి వెళ్ళిపోయాడు.

## 11

మధ్యాహ్నం ఒంటిగంట. ఎండ తీవ్రంగా కాస్తుంది. నల్లత్రాచు బుసలు కొట్టినట్లు యెండవల్ల నల్లటితారురోడ్డు భగభగ మండుతుంది. ఆ సమయంలో గీత యింట్లో ఓ వ్యక్తి అడుగుబెట్టాడు. అతని కణతలనుండి స్వేదధార ప్రవహిస్తోంది. ఆ వ్యక్తికి బహుశా అరవై సంవత్సరాలుండవచ్చు. అతన్ని చూడటంతోటే లక్ష్మి పరుగునపోయి నాన్నా అని కౌగలించుకొని వెక్కి వెక్కి యేడ్చింది. ఎందు

తల ఏమవుతుందో అతనికేమీ అర్థం కాలేదు. లక్ష్మి అతనిని గీత గదిలోకి తీసుకెళ్ళింది. గీత మంచంమీద పడుకొనివుంది. కానీ స్పృతిలో లేదు. తండ్రి గీత నొసటిమీద చెయ్యిపెట్టిచూచాడు. సలసల కాగిపోతుంది. తలవని తలంపుగా అతని కండ్లనుండి రెండు కన్నీటి చుక్కలు కారాయి.

లక్ష్మి తండ్రి ఆజ్ఞ ప్రకారం డాక్టరును పిలుచుకొనివచ్చింది. డాక్టరు ఆమెను పరీక్షించాడు.

“డాక్టరుగారూ! నా సర్వస్వం ధారపోస్తాను. ఎలాగయినా బ్రతికించండి” అన్నాడు ఆ ముసలి.

“కాలం మించిపోయింది. ఇక దైవసహాయమే కావాలి. అయినా ఓ ఇంజక్షను యిచ్చి చూస్తాను” అంటూ ఓ యింజక్షను యిచ్చాడు.

◆ ◆ ◆

నాగేష్ పెళ్ళిపరివారంతో మరికొంతమంది స్నేహితులతో వివాహానికి తరలిపోయాడు. మూర్తిని రమ్మన్న మాట మర్యాదకు పిలిచాడేకానీ మనస్ఫూర్తిగా పిలవలేదు. నాగేష్ వెళ్ళిన విషయం మూర్తికి ఆ సాయంత్రం తెలిసింది. అతను నాగేష్ యింటినుండి సుందరి యింటికి దారితీశాడు.

అతను సుందరి యిల్లు చేరేటప్పటికి సుందరి గీత చరిత్రను తలచుకుంటూ కాబోలు యేడుస్తూ కుర్చీలో కూర్చునివుంది.

“సుందరీ!”

“ఓ! మీరా! రండి” అంటూ కుర్చీ చూపింది.

ఇరువురి ముఖాల్లో విషాదచ్ఛాయలు పొడగడ్తున్నాయి. కాసేపు యిరువురూ మౌనం వహించారు.

“గీత యెలావుంది” అని జాలిగా అడిగింది సుందరి.

“నేను వాళ్ళింటికెళ్ళి నాలుగురోజులయింది. కానీ జబ్బుతో వుందని మాత్రం విన్నాను.”

“ఏం జబ్బు!”

“ఇంకేముంది? మనోవ్యాధే!”

“పాపం! మూర్తిగారూ! నేనామెను చూడవచ్చా?”

మూర్తి సుందరి కళ్ళల్లోకి చూచాడు. సుందరి కళ్ళల్లో నీళ్లు తిరిగాయి.

“సుందరీ! ఏమిటది” అని ఆశ్చర్యంతో అడిగాడు మూర్తి.

“ఏమీలేదు” అంటూ పైటచెంగుతో కంటినీరు తుడుచుకుంది.

మూర్తి చాలాసేపు మౌనం వహించాడు. “సరే వస్తాను. రేపు ప్రొద్దున్నే వచ్చి మిమ్మల్ని గీత యింటికి తీసుకెళ్తాను” అంటూ మూర్తి వెళ్ళిపోయాడు. సుందరి అలాగే శూన్యాకాశంలోకి చూస్తూ వుండిపోయింది.

## 12

నాగేష్ పిఠాపూర్ చేరాడు. విడిది గృహంలో అడుగుపెట్టాడు. అది అతని స్వగ్రామ మయినప్పటికీ యిప్పుడది అత్తవారవూరు. అక్కడికెళ్ళిన తర్వాత తెలుసుకున్నాడు, పెళ్ళికూతురు యెవరో కాదు, తన చిన్ననాటి స్నేహితురాలు భ్రమర గీత అని.

నాగేష్‌కు అది పాతపేరు, తను చిన్నవాడు పిలిచిన పేరూ అయినప్పటికీ ఈనాడెందుకో ఆ స్వరం కొంత బాధాకరంగానే తోచింది. ఒక్కసారి వెనుకకు ఆలోచించాడు. తను, గీత స్కూల్లో కలుసుకున్నారు; చెరువుగట్టున ఆడుకున్నారు. తను ఆమె వల్ల సుఖం పొందాడు. కానీ యిప్పుడు ... మరిచాడు.

భాజా భజంత్రీలు, పెళ్ళి మేళాలు మ్రోగజొచ్చాయి. అతని తండ్రి వచ్చిన అతిథులకు స్వాగతం యిస్తున్నాడు ఆనందంతో.

◆ ◆ ◆

గీత పడకమీద అంత్యదశలోవుంది. మూర్తి, సుందరీ గీత గదిలోకి కాలుపెట్టారు. మూర్తిని చూడగానే లక్ష్మి అతనివద్దకు పరుగెత్తుకొనివెళ్ళి

కౌగలించుకొని బావురుమని యేడ్చింది. లక్ష్మి కంటి నీరు మూర్తి హృదయాన్ని తడిపివేసింది. సుందరి కండ్లల్లోనుంచి నీటిధార ప్రవహింప జొచ్చింది.

"ఏమిటి లక్ష్మీ" అని ఆదుర్దాతో అడిగాడు మూర్తి.

"అక్కయ్య చని ... "

"చనిపోయిందా ?"

లక్ష్మి చటుక్కున మూర్తి నోరు మూసింది.

"అక్కయ్యకు కడుపులో బల్ల పెరిగిపోయింది. లాభంలేదని చెప్పాడు డాక్టరు."

మూర్తి చలించని స్తంభంలా నిలబడిపోయాడు. గీత రొుగుడు దిగుడు శ్వాసలో మునిగి తేలుతూంది. గీత తండ్రి, సుందరి, లక్ష్మి అందరూ ఆమెకెట్టు దీనంగా చూస్తున్నారు.

మూర్తి, "రత్నం" అంటూ ఆప్యాయంగా పిలిచాడు దగ్గరికిపోయి. గీత పలుకలేదు. కొద్ది సేపటికి గీత యిటువైపు పొర్లింది. అందరూ ఆశగా చూచారు. మూర్తి జాలిగా డాక్టరు కండ్లలోకి చూచాడు. డాక్టరు పెదవి విరిచాడు.

"లక్ష్మీ" అన్నది మృదువుగా గీత.

"అక్కయ్యా!" అంటూ బావురుమంది లక్ష్మి.

"మూర్తి వచ్చాడా" అని అతికష్టంతో అడిగింది. మూర్తి దగ్గరకు వెళ్లాడు.

◆ ◆ ◆

ముహూర్తం సమీపించింది.

చావు ఆసన్నమయింది.

పెండ్లి పందిరిలో ఎలక్ట్రిక్ దీపాలు నిశ్చలంగా వెలుగుతున్నాయి.

చావుగదిలోవున్న ప్రమిద మిణుకు మిణుకు మంటోంది.

"మూర్తీ! యిదేకదూ నాగేష్ పెళ్ళి సమయం!" అని మెల్లగా గొంతుక విప్పింది గీత. నాగేష్ మేళతాళాల మధ్య కూర్చుని వుంటాడు. ఆ మ్రోతలే నా హృదయాన్ని చీల్చివేస్తున్నాయి. నా యీ శరీరమే నాగేష్ భార్యరూపం తాల్చుతుంది. నా బదులు అతని భార్య నా చెల్లెలు. ఒకరి బదులు మరొకరికి సుఖం.

◆ ◆ ◆

మంత్రాలు జోరుగా పఠిస్తున్నాడు పురోహితుడు. '...కట్నపు సొమ్ము పట్రాండి బావగారూ' అంటూ అరుస్తున్నాడు ముకుందరావు. మంగళ వాద్యాలకు పెళ్ళిపందిరి దద్దరిల్లిపోతూంది. నాగేష్ కాబోయే భార్య మెడలో మంగళసూత్రం కట్టబోతున్నాడు.

◆ ◆ ◆

గీత "మూర్తీ! లక్ష్మిని నీ ... వు అ ... న్యా ... యం ... చే ... య ... వు ... గా ..." అని అంటూ తలవాల్చింది.

అక్కడ నాగేష్ భ్రమరగీత మెడలో తాళికట్టాడు. అందరూ ఆశీర్వదించారు ఆ నూతన దంపతులను.

◆ ◆ ◆

మూర్తి గీత కళేబరంకేసి ఓసారి దీక్షగా చూసి కండ్లు మూశాడు. అతనికి వెనుకబడిన విషయాలన్నీ జ్ఞప్తికి వచ్చాయి.

ఎంత మార్పు! అనురాగంతో ఒకప్పుడు ఆటలాడినవారే మరుక్షణంలో యీర్ష్యా సముద్రంలో యీదులాడారు. కాళరాత్రిలో ఒకరు నడి సముద్రానికి, ఒకరు గట్టుకు వుధృతంగా లేస్తున్న అలలతో కొట్టబడ్డారు. ఒకరిలో ఆనందం మరొకరిలో దుఃఖం పెనవేసుకున్నాయి. లోకం ఆనందానికి పూలహారాలు తొడుగుతుంది. దుఃఖానికి ముండ్లకట్టెల పాన్పు చేసింది.

మూర్తి గొంతుక రొండిపోయింది. ఆమె తన కాదర్శజీవి. లోకానికి న్యాయం చూడడానికి కళ్లు, నిజానిజాలు బయటపెట్టడానికి నోరు లేదని అప్పుడు తెలుసుకున్నాడు.

◆ ◆ ◆

లక్ష్మి, మూర్తి ఆమె సమాధికి పూలమాల అర్పించారు. సుందరికూడా తన వుడుతాభక్తిని చూపింది. ఆసమాధి దగ్గర నిలుచుంటే వారితో ఆమె మాట్లాడినట్లే వుండేది. ప్రతీ శనివారం సంధ్య వెలుగులో ఆ ఆదర్శజీవి సమాధికి పూలువేసి ఆమె త్యాగానికి అశ్రుతర్పణంచేసి తిరిగివచ్చేవారు.

# త్రయీమూర్తి

"వన మయూరి"



చిలికి దరహాస కౌముదీ శీకరముల - తొఁగకనుల చూడ్కి బంధాలు తొడిగి, యెట్లు
హృదయము చలింప పదములు కదలకుండ - చేయు నాధోరణ కల్గె చెప్పు మబల!

విశ్వవిఖ్యాతి గన్నకోవిదులె యైన - అస్మదీయపదంబును విస్మరించి
పాలబుగ్గల చిన్నారిపాప లగుచు - తల్లి, నిను జేరుకుదు రౌదె యుల్ల మలర!

సోదరస్నేహ సౌందర్యశోభ జెంది - దశదిశల నేక మొనరించు తావకీన
పరమకల్యాణ వీక్షణపాత్ర నగుచు - ధన్యతం గాంతు దేవి, నీ దర్శనమున.

దివ్యసంతాన సందీప్త వాత్సల్యంబు - సురనదీ పావనశోభ గొలుప
పతిదేవు వీక్షణ ప్లావిత ప్రణయంబు - యమునా తరంగిణి ననుసరింప
రమణీయ సౌభ్రాత్ర రంజితస్నేహ మా - పూత సరస్వతిరీతి నెసగ
యుష్మదీయ సుధారసోజ్జ్వల హృదయంబు - హర్ష పారావార మందుకొనగ
సకలదురితాపహారివై శాంతమధుర - వివిధరస పరిపూర్ణ "త్రివేణి" యట్లు
పరమరాగైక వైభవప్రాభవమున - వరలుచుండు 'త్రయీమూర్తి', వందనమ్ము!

# కుంభి

మూలం :
'పద్మశ్రీ' శ్రీమతి మహాదేవివర్మ

అనుసరణ :
"సులేఖ"

'బదలు' మృణ్మయపాత్రల నిర్వికార నిర్మాత మాత్రమేకాదు; విచిత్ర వక్రరూపాల సంతానపు నిశ్చింత సృష్టికర్తకూడాను. నిర్జీవమైన మట్టిలోనుండే సజీవ శిల్పచాతుర్యముగాని సజీవ రక్తమాంసాలలోని నిర్జీవ నిష్ప్రభ నిష్ప్రాణులుగాని అతని మనసు నాకర్షించలేక సమాధి భంగం కలిగించే శక్తి సామర్థ్యాలను సాధించలేకపోయినాయి.

ఒకమూల కాలీకాలని, ఎండీయెండని పాత్రలతోను, వేరొకమూల దుర్గంధం చిందుతూ, నగ్నశరీరాలతో, బక్కచిక్కిన బానపొట్టల పిల్లలతోను యెల్లప్పుడు పరివేష్టించియుండే బదలును నేను చాల సార్లుచూశాను. కాల్చటంలోను, యెండబెట్టటంలోను కాపాడలేక కొన్ని పాత్రలు పగిలిపోతాయి. పిల్లలుకూడ జన్మించుతూ కొందరు, పెద్దలైన పిదప మాతాపితల మహత్కార్యాలకు సాయపడతారని నమ్మించుతూ కొందరు చనిపోతారు. జనన మరణాల జనాభా లెక్కల దర్పణంలో బదలు సుఖదుఃఖాలను చూడటం సంభవించలేదు. బదలు చిత్రాన్ని చిత్రించటం యెంతటి చిత్రకారునికైనా సాధ్యంకాని పని. పరస్పర విరోధాలైన అతని శల్యాలే దానికి కారణం. ఒక దానిని ప్రత్యక్షపరుస్తుంటే రెండవది పలాయనం చిత్తగిస్తుంది.

ఆతని ముఖాకృతి శ్యామలమైనది, సౌమ్యమైనది. కాని నాశికాపుటాల కిరువైపులనున్న రెండు శల్యాలు మాత్రం ద్రోహం తలపెట్టి అతనిని అస్థిపంజరంలా చేసినయి. ఆ ఆజానుబాహుని విగ్రహం ఒకనాడు సమున్నతమైనదే! కాని ఆకసం అడ్డువచ్చింది. క్రుంగి, వంగిపోయిందిప్పుడా శరీరం. విరామ మెరుగని పరిశ్రమవలన యౌవనంలోనే రివ్వున వృద్ధాప్యం సంప్రాప్తించింది. స్త్రీ నయనాలలా సిగ్గును సూచించే ఆతనికండ్లు వెలుగులు విరజిమ్ముతాయి. నిరంతరం సాగించే యాంత్రిక కృషివల్ల నల్లని మట్టిబొమ్మకు పెట్టిన తెల్లని చిన్నికండ్లులా కనబడుతాయి ఆతని నయనాలు. వణకుతూవుండే ఆతని పెదవులనుండి వెలువడే గొంతులోని గొణుగుడువింటే ఆశ్చర్యం కల్గుతుంది! మురళీరావంలా స్ఫురిస్తుంది.

స్వభావముతోనే "బదలు" మితభాషి. అంతేగాక నావంటి నాగరికుల శ్రవణశక్తి సీమకు అనభిజ్ఞుడు. అందువలన ఆతనిని గురించి తెలిసికొనే అవసరం నాకెప్పుడు కలుగలేదు.

వస్తూపోతూ నేనెప్పుడైనా తిరుగుతూండే అతని సారెపైని సజీవ నిర్మాణక్రమము విలోకిస్తూవుంటే అతను హఠాత్సంభ్రమా విష్టుడౌతాడు. తన తొందరపాటును దాచుకోటానికి మాటిమాటికీ దగ్గుతూ గొంతు సాఫీచేస్తూ కంగారుగా, "ఖేదన్! దుఖియా! సత్తూ" అంటూ చాప యెత్తుకురమ్మని మొత్తుకొంటాడు. దేవేంద్రుని సహస్ర నయనాలలాగ చిల్లులు, గంగానది ముఖద్వారంలా బహుముఖపాయలుగల చాపను చీకటి ఖైదులోనుండి విడిపించే ప్రయత్న పోరాటము ఆ పిల్లలు సాగిస్తున్నప్పుడు అక్కడినుండి శెలవుతీసికొనడమే శ్రేయస్కరమని భావిస్తా. దానిమీద నేను పద్మాసనం వేయడం ప్రారంభిస్తే దాని క్షేమం సందిగ్ధంలో పడడంతో పాటు నా యిస్త్రీ వస్త్రాలకు భవిష్యత్తు శూన్యం!

"బదలు" యింటి ప్రక్కగానే నేను వస్తూపోతూ వుంటాను. అందువలన రాకపోకలలో ఆలస్యం జరుగుతుంటుంది. అచటున్నందువలన యెవరికీ యెటువంటి విఘాతమూ కలుగదు. ఇటువంటి అవకాశం లభించడం చాలా కష్టం.

వాకిలి వూడుస్తూనో లేక యే యితర గృహకార్యాన్ని నిర్వహిస్తూనో "రధియా" కన్పించితే ఆ రోజు మరింతసేపు అక్కడ ఆగడం అవసరమేగాకుండా అనివార్యముకూడాను. కాంతులు కురిసే

కండ్లు, స్మితశ్రీ చిందే అధరాలతో ఆమె యాంత్రిక కృషి గావించే తన విచిత్రకథ వినిపిస్తుంటే యెంతో బావుంటుంది. ఆమె విచిత్ర విచలిత నయనాలు, అధరాలు - ఆకారమంత తన తన వ్యధిత కథల్ని చెప్పటానికి ఉవ్విళ్లూరుతున్నట్లుంటాయి. అందువలన శబ్దాలతో ఆమెను గురించి కొద్దిగానే చెప్పాల్సివుంటుంది. ఆమె కథ వినేవారెవరూ సగంలో శెలవుతీసికోలేనంత మర్మజ్ఞానము ఆమెకుంది. కరుణగానములా ఆమె కథ తన హృదయములా యితరుల హృదయాలను సైతం మథిస్తుంది. అందువలన "రధియా" వద్ద వుద్యోగాన్నాపుకొనుట నా కెంతో కష్టమనిపించేది.

దైన్యదేవత ప్రతిరూపమే "రధియ" అని చెప్పాలి. పురాతన వస్త్రాన్నుంచి చించిన అంచుతో బంధింపబడిన శిరోకేశాలకు ఆమె తైలసంస్కార ప్రయత్నం మాత్రం చెయ్యదు. కట్టుగుడ్డరంగు క్రిందనున్న మట్టిరంగును ప్రేమిస్తోంది. ఆకారసమన్వయం సూచిస్తోంది. శిరస్సుపైకి ముసుగులాగితే ప్రేళ్లవెంట అంచువూడి ముక్కువరకూ వచ్చింది. "వృద్ధురాలను భద్రమంటూ ... "

దుఃఖము ఒక విధమైన శృంగారము. అందువల్లనే దుఃఖిత వ్యక్తులు యితరుల దృక్కులను బంధిస్తారు.

"రధియ" ముఖాకృతికూడ తన వ్యధను బహిర్గతం జేస్తోంది. వెడల్పాటి ముఖం. ఆమె నాశిక కనుల కనుమ మధ్యనుండి తిర్యద్రేఖను చిత్రిస్తూ అధరాలపైని వలయమైనది. కాటుకనిండినకళ్లు, యెవరో బలంకొద్దీ కండ్లలో కాటుకరుద్దినట్లున్నయ్. అధరాలమీద మచ్చలు - కఠోరమైన మందుగల పాత్రయొక్క నిరంతరస్పర్శ చిహ్నాల్లావున్నాయి. ఇన్ని వైషమ్యాల సమిష్టిలోకూడ విదగ్ధ హృదయానుండి వుద్భవించిన సామంజస్య పూర్ణమైన ఆకర్షణ ఒకటి అగుపడుతుంది. ఆమె జీవనరసాన్నుండి విసర్జింపబడి తేలికపడింది కాని దుఃఖసంద్రానమునిగి బరువైంది. అందువలన ఆమెలో దృక్కులను బంధించలేని శూన్యత్వమూలేదు; హృదయాన్ని స్పందింపజేయలేని తేలికదనమూలేదు.

సొట్టలుపడి, వలయాకారాన్నుండి చదరంగా రూపొందాలని వాంఛించే సత్తుగాజులు రెండు, ధూళిని దత్తతగొన్న రూపురేఖాహీనములైన రెండు లక్కగాజులనుమించి మరే యితర ఆభరణములతో "రధియ"కు పరిచయములేదు. కాని ఆ పరిచయము కొరకు పరితపిస్తున్నట్టు సైతము కనుపించదు. గట్టిపడిన శరీరము, కఠినమైన శరీరాంగాలతోనున్న ఆ స్త్రీ యెడతెగని సంతానము, కడతేరని కష్టాలకారణాన మిగిలిన యీ ఆకారముతో పనిపాటలుచేస్తూ తిరుగుతున్నదంటేను, యింతకంటె విస్మయ విషయాలున్నవంటేను నిజంగా విస్మయం కలుగుతుంది.

సామాన్యంగా యీ వర్గపు స్త్రీలలో కాన్పించే కర్కశ ప్రగల్భత "రధియ"లో యేకోశాన కనుపించదు. నా వుదాశీనతా కౌతూహలంలో, కుతూహల సమ్మానంలో ద్విగుణీకృతం నిండివుండటానికి కారణం యిదే కావచ్చు. "బదలు" పట్ల ఆమెకు గాఢానురాగంవుంది. ఆమె యెప్పుడూ సంసారాన్ని గురించిగాని, పిల్లలను గురించిగాని దుఃఖించడమూ జరుగలేదు; "రధియ" నోటినుండి మూర్ఖుడూ శయుడైన తన భర్తపై నిందావాక్యాలు వెలువడగా విను సౌభాగ్య సంప్రాప్తి యెవరికీ కలుగలేదు. తన భర్త శ్రేష్ఠుడైన కుంభి, శిల్పశిరోమణి, కళాస్రష్టనీ అతనిలోనున్న మహాత్వాన్నెవ్వరూ గుర్తించరనీ "రధియ" విశ్వాసం.

కోడికూతతో మేల్కొని జొన్నలు, సజ్జలతో రొట్టెలుచేయడం, జావకాయడంవంటి కఠోర కర్తవ్య కార్యక్రమం మిణుకు మిణుకుమనే దీపనక్షత్రం విరజిమ్మే ధూపకాంతులలో అలుగుతూ, మూలుగుతూ వుండే ముద్దుబిడ్డలకు ఆదరపూర్వకమైన ఆహార విభజన చేయడంతో పరిసమాప్తమౌతుంది.

ఊపిరిపీల్చే పిల్లలైదుగురేయైనా సంతానసంఖ్య తెల్పే సమయంలో స్మృతిశేషులైన తనశేష సంతా

తాన్ని కలపిచెప్పటం "రధియా" అలవాటు. చనిపోయిన తన సంతానత్రయానికి సజీవపుత్రుల సరసనే స్థానాలు ప్రత్యేకించడంమాస్తే మతిమరపునకూడ వారు మరణించారని భ్రమించలేం! మృతులు కేవలం కథల్లా శ్రుతిసంతృప్తికి మాత్రం అదృశ్య స్థితిలో జీవిస్తారు; సజీవులు మాత్రం కళ్లాప్రత్యక్షమైన తండ్రి; కష్టజీవినిదైన తను తల్లియొక్క కార్యకలాపాల్లో సాయపడుతూ, సాయపడుతూ తమ జీవన రంగాల్ని సమాప్తపరుస్తారు. ఇంతే తేడా. తమ దుర్బల నగ్న శరీరాలనుండి ఉచ్ఛ్వాస నిచ్ఛ్వాసాలు మాత్రం వేరుకానిపరిస్థితి తటస్థించేవరకు వారు మట్టి త్రవ్వడం, సంతకు కుండలు చేరవేయడం మొదలైన సాహస కృత్యాలు చేస్తూనే వుంటారు. అందరికన్న చిన్నవాడు "సత్తు"కూడ తన పొట్టకు పదింతల పరిమాణముగల బానను నెత్తిపైకెత్తుకొని తూలిపోతూ వుండే కాళ్లతో తప్పటడుగులు వేస్తూ దానిని సంతకు చేర్చే వుత్సాహం చూపుతూంటే వాడి పురుషార్థాన్ని జూచి నవ్వనూ లేం! ఏడవనూలేం!!

మట్టికుండల నమ్ముకుంటేనే సరిపోదు. వృత్తికర్మతోనే తమ జీవనాధార సమస్య సుకరముగానందువల్ల పరిసరప్రాంతపు క్షేత్రాల్లో పనిజేస్తుంది "రధియ." సంతనుండి "బదలు"; పొలంనుండి "రధియ" తిరిగివచ్చేలోపల ప్రాణవాయువు మాత్రం మిగిలిన పరమాణువులు ధూళితోను, నీళ్లతోను ఆడుకుంటారు. పొలంనుండివచ్చిన "రధయ" పురాతనమయిన తమ బొంతపైన పంక్తిగా వారందరినీ యుక్తిగా నిద్రబుచ్చుతుంది. ఆ ప్రశాంత వాతావరణములో చట్టధిక్కారణజేసి పైతాయింపు సమ్మె ప్రకటించిన వ్యక్తిని పుట్టిపెరేలాడే మట్టికుండలోని మందపాటి రొట్టె ముక్కతో రాజీసాధిస్తారు. ఇతరులు మాత్రం దయార్ద్ర హృదయముతో ప్రాప్తించే ఆమె పెదిమల ముద్దులతో ఆ నాటి రాత్రి గడుపవలసివస్తుంది.

ఆమె శోకాల శ్లోకాలతో, రాకాశిపూజలతో, యేకాదశవ్రతాల పారాయణం యెన్నాళ్లుచేయాలో ఆ పేద ప్రాసాదపు అధిపతి "బదలు"కు తెలియదు.

విచిత్ర వ్యక్తులు వారిరువురు. పతి ఐదువ్రేళ్లు నోటిలోకెళ్ళే యేర్పాటు చేయలేకపోయినప్పటికీ, కట్టుగుడ్డలకొరత తీర్చలేకపోయినా, పనిగండుల భవిష్యద్వర్తమానాలను గురించి ఆలోచించలేకపోయినా ఆ దుర్గుణాలు దుర్గుణాలుగా గోచరించవు ఆమెకు. సంతోషముగా వుండవలసిన అవసరమే అగుపడదు.

ఆ గృహంలో యేబిడ్డయినా కోలాహల హీనంగానే జన్మిస్తాడు. "లడ్కీ" పుట్టినరోజు ఆ సాయంత్రంవరకు కావడు నీళ్లు పట్టే కుండ నెత్తిన పెట్టుకొని "రధియ" నీళ్లు తేవడం నేను చూచాను, కడవదింపి సప్తసింధులా యేడుపాయలుకలిగి చిరపరిచితమైన చాప వేసింది. ఇష్టంలేకున్నా కష్టసహిష్ణుతతో పిల్లలతో పిచ్చాపాటీ మాట్లాడుతూవుంటే కావాలని కోసుకున్నా కంఠం తెగని మొండికొడవలి దెచ్చి రోటిమీద నూరుతూ పదునుపెడుతోంది "రధయ." నాకు నవ్వొచ్చింది. "రాత్రి దీనితో పనేమొచ్చింది? కొంపతీసి యెవరిదైనా గొంతు కోస్తావేమిటి" అన్నాను. ప్రత్యుత్తరంగా మలిన భావంతో చిఱునవ్వింది "రధియ".

మరునాడు సోమవతీ అమావాస్య కావడంచేత నాకు మరింత అవకాశం లభించింది. అందువలన అచటకు వెళ్లడం సంభవించింది. "బదలు" వదనం యథాప్రకారంగానేవుంది. కాని పిల్లలంతా గడప దగ్గరజేరి గడబిడ జేస్తున్నారు. నేను సంకోచిస్తూ "మీ అమ్మేదని" దుఃఖియానడిగాను. తన తోబుట్టువులందరికన్న దుఃఖియా మాటకారి. దీర్ఘ శ్వాసల్తో సుదీర్ఘమైన కథలెన్నో వినిపించింది - వాళ్ల కొత్త పాపాయి పుట్టింది. అమ్మేమో ... మంతరసాన్ని పిలవొద్దంది - రూపాయి యియ్యాలంట ... కొడవల్తో మా యమ్మే పిల్లగాడి బొడ్డు కోసి వసారామూలనే పూడిసిపెట్టినాది. పిల్లగాడేమో బీతిగొనిపోయిండు. అయ్యేమో బజారుకురికి

రొక్కైత్తుకొచ్చి అమ్మకిచ్చిందు. ... మొదలైన మహాత్వపూర్ణవిషయాలెన్నో నాకు క్షణంలో తెలిసినయి. మలినవస్త్రాల్లో మేలమాడుతున్న శ్యామాంగిని రధియా మట్టిగోడల మధ్యనున్న అంధకారంలో లీనమైపోవటంవలన లోపలికి వంగి చూడాలనే నిష్ఫల యత్నంచేశాను. భావి కుంభకారుని సమీపంలో చూచే వుద్దేశ్యంతో అనుమతితో సహా లోపల అడుగుపెట్టాను.

ఆ చీకటిగదిలో పరుండిన రధియా నవజాతుడైన తన బిడ్డకు జీవనంతోపాటు ఆ జన్మదారిద్ర్యాన్ని సైతం పరిచయంచేస్తున్నది. గ్రుడ్డునుండి తత్‌క్షణమే జనించి రెక్కలులేని పక్షిలా రెక్కలు మూసుకున్నాడుబిడ్డ. బొడ్డుకోసినచోట రక్తంకారుతూ దుర్గంధం కొడుతూంది.

అర్థమయింది. రూపాయికి రాజీపడనందున మధ్యన మళ్లీ మంత్రసాని వ్యర్థమని రధియా తానే కార్యక్రమాన్ని ముగించింది.

బాధవల్ల లేవలేకపోయింది ... పడుకునే మొండి కొడవలితో బొడ్డుకోసింది. అందువలన సరిగా కోయలేకపోయింది. ఐనా ఫరవాలేదు! నూసెరాస్తే రెండు మూడు దినాల్లో అదే యెండిపోతుంది. నేను ఆశ్చర్యంతో ఆ విచిత్ర జననియొక్క మలినముఖంలో ప్రశాంతమైన సౌమ్యరేఖల్ని చూడగల్గాను.

ఆమెకోసం నేను పాలు వగైరా తెచ్చేందుకు సన్నద్ధమాతుంటే యిదివిని ఆమె మరింత కారుణ్యభావంతో చిరునవ్వింది. ఆమె అన్నది - "తమరు యియ్యాల రేపు యెత్తుకొస్తారు. యాడాది పొడుగునా యెవరుతెస్తారు? ప్రాణమున్నంతవరకు యిట్టనే వుంటాది."

సారెవద్ద నిశ్చింతగా కూర్చున్న బదలును పిల్చి బెల్లం, నేయి వగైరాలన్నీ అవుసరమన్నాను. ఈ మాటవిని ఆకసాన్నుండి పృధ్వీతలాన పడినట్లయ్యాడు - "అది బెల్లం చూసినాదంటే డోకులాత్తయ్, నెయ్యిగాని తాగినాదా పొట్టలో పోటుపుడతయ్; గనకనే దుకాణంలో రొట్టె తెచ్చినా!"

బదలుయొక్క సౌమ్యవదనాన్నిచూసి నా మిథ్యావాద సిద్ధాంతాలవల్ల సిగ్గుతో తలవంచుకుని రధియాపై దృష్టినిల్పాను - ఆ సమయంలో ఆ యిల్లాలి స్థితిని వర్ణించలేం. బదలు యేవస్తువునైతే సంపాదించేందుకు అశక్తుడైయున్నాడో ఆ వస్తువును వుపయోగించటం రధియాకు హానికారకంగా స్ఫురిస్తుందని తెలిసికోటానికి నాకెక్కువ సమయంపట్టలేదు. కాని ఆ దివ్యజ్ఞానాన్ని దాచి ప్రశ్నించా - "డోకుగానీ, పోటుగానీ అందరాడవాళ్లు తినేవి రధియా కూడా తినాల్సిందే!"

ఆ యింటిలో జననమెంత ఆడంబరహీనంగా వుంటుందో మరణంకూడ కోలాహల హీనంగానే ముగుస్తుంది.

పసిబిడ్డ తీవ్రజ్వరానికి గురయింది. స్ఫోటకపు చిహ్నాలు స్పష్టంగా కన్పించినమీదట చీకటిమూలనున్న విరిగిన మంచం సరిచేసి దానిమీద పరుండబెట్టింది. వెంట్రుకల దిష్టితీయటం, దేవిపేరున జలం చిలకరించటంలాంటి పనులు చాల చేసింది. రధియా విశ్వాసానికి, శక్తికి సరిహద్దులోపలగల సర్వవిధ కర్తవ్యాల పరిపాలనలో లేశమాత్రమైన ఆలస్యం జరగలేదు. కాని నాల్గవ రోజున పసిగ్రుడ్డు భగవ సాన్నిధ్యంచేరింది. ఆ బాలికపైన బదలూకు అమిత ప్రేమ. అందువలన యమునానదీ గభీర జలాల్లో పసిబిడ్డను విసర్జించి యింటికిరాగా అతని శాంత గంభీర వదనంలో మర్మవ్యధను రధియా గుర్తించి స్వప్నగాధనొకటి అల్లింది - స్వప్నంలో దేవి కనుపించి యిన్నాళ్లుంచుకోమనే తానా బిడ్డ నిచ్చాననీ యిప్పుడు తన బిడ్డను తనకు యిచ్చివేయమని అడిగిందట. బదలులాంటి మూర్ఖుడు యిటువంటి కట్టుకథను నమ్మితాడనటంలో సందియంలేదు. కావాలని దేవేవచ్చి బిడ్డను తీసికొనిపోయింది గనుక పండు

మాకులు వేయకపోవటం మంచిదే అయింది! ఒక వేళ వేసినా వాటివల్ల బ్రతకదుకూడా! అదీగాక దేవికి కోపంవస్తుంది. కోరికోరి దేవి తన బిడ్డను తీసికెళ్తే ఆ బాలికకు అంతకు మించిన అదృష్టమేముంటుంది?

ఒకసారి నేను రధియాకు అబద్ధాలాడటం గురించి సారగర్భితమైన ఉపదేశం యిచ్చాను. కాని తన జీర్ణశీర్ణమైన చీరచెరగుతో కనుకొలకులనుండి స్రవించే కన్నీటిని తుడుచుకొంటూవున్న రధియా ఉద్విగ్న హృదయానుండి వెలువడిన వాక్యాలు సైతం సారహీనములైనవి కావు - తనపతి ఒట్టి అమాయకుడు. చిరు గాయాలకు సైతం పర్వతాలు మీదపడ్డట్టు ధైర్యం కోల్పోతాడు. అన్ని జీవాలకు రెండుపూటల ఆహారం సముపార్జించిపెట్టే స్తోమతలేని కుటుంబపరిస్థితి. అందువలన తనకు, తన బిడ్డలకు చిన్న చిన్న గాయాలవల్ల కలిగే మర్మవ్యధలను బదలుకు దూరంగా వుంచటం రధియా అలవాటు. పరలోకంలో భగవంతుడామెకు యేశిక్ష విధించినా తాను మాత్రం యెవరి ఐశ్వర్యాలను, ఆస్తుల్ని దొంగిలించటానికి మాత్రం అసత్యం పల్కటంలేదు.

రధియా సమాధానమే నాకు ప్రశ్నగా తయారయింది! ఆమె అసత్యాన్ని అసత్యమని యెలా అంటాం! అనకపోతే దానిని మరే నామంతో పిలుస్తాం!!

ఆ మందపాటి మూకుళ్లు బోడిపిడలకు బదులుగా యే అందంగా నగిషీగా, నాజూకుగావుండే పాత్రలో చేస్తే పట్టణాల్లో సైతం అమ్ముకోవచ్చునని బదలుతో నేనెన్నోమార్లు అన్నాను. సారెను త్రిప్పుతూ తీవ్రంగా ఆలోచించే అతని గొంతులోంచివచ్చిన గొణుగుడుయొక్క అర్థమేమంటే తన తాత ముత్తాతలంతా యిటువంటి కుండలే జేసేవారు. వారంతా కుగ్రామపు కుమ్మరులే. బస్తీలో అమ్మేంత గొప్పగా వుండేవాటిని వారు తయారుచేసేవారుకాదు. అందువల్ల ...! ఇకను అధికంగాజెప్పి ప్రయోజనం శూన్యమని భావించాను.

ఒక రోజున నేను పాఠశాల పిల్లలకు పౌరాణిక కథలు బోధించటానికి కొన్ని బొమ్మలు తీసికొని వెళ్లాను. అవి ఏమంత కళాత్మక చిత్రాలు కావు కాని బజారులో అమ్మబడే శివుడు, పార్వతి, సరస్వతి బొమ్మల్లాంటి వికృతి రూపాలకంటె కాస్త మెరుగనవచ్చు.

బదలు పిల్లల్లో దుఃఖిగాకే కాస్త చదువు సంధ్యలున్నాయి. ఆమె తన తండ్రికీ వర్తమానం అందించియుంటుంది. తన మౌన గాంభీర్యానంతా వదలి పరుగులిడుతూ నా వద్దకొచ్చాడు. నా విస్మయానికి మేర లేకపోయింది. నేను అన్ని చిత్రాలు చూపించి వాటిని గురించి సాధ్యమైనంత సరళభాషలో చెప్పాను. అప్పటికికూడ బదలు యింకా పిల్లల గుంపుతోనే కూర్చున్నాడు. సరస్వతీ చిత్రంపైన అతనిదృష్టి పడింది. రెప్పలార్పకుండ చూస్తుండటం జూచి "నీకిది కావాలా" అని ప్రశ్నించాను.

బదలు సంకోచించాడు - ఇంత అందమైనపటాన్ని అడిగితే యిస్తారా? అన్నట్టుగా. అతని మనోభావాలను గ్రహించి నేనా చిత్రాన్ని అతనికిచ్చాను. పసిపిల్లవానిలా ఆనందాతిరేకంతో స్తబ్ధుడైనాడు.

బదలు ఆ పటాన్ని తన గాఢాంధకార గృహాపు శిథిల ద్వారంవద్ద యేదో జిగురుతో అంటించియుండటం జూచినమీదట నిజం చెప్పాలంటే నేనా చిత్రపు దౌర్భాగ్యస్థితికి దుఃఖించాను.

దీపావళికి మట్టిబొమ్మలనేకం కొనే అలవాటు నాకు. వాస్తవానికి ఆ నాడు శిల్పకారుల కళాకౌశల్యాన్ని ప్రదర్శించబడుతుంది; ఆ నాటి వుత్సాహాన్ని, ప్రోత్సాహాన్ని పురస్కరించుకొని యేడాది పొడుగునా తమ కళావికాసపు దెస దృష్టిమరల్చి ప్రయత్నపథంలో ప్రస్థానం సాగిస్తారు కళాకారులు. ఆధునిక నాగరికతా ప్రపంచం మన వుత్సవాలను నిరుత్సాహపరచటమేగాక శిల్పకారుల కళాపైతృకములకు సైతం అడ్డుకట్టలు కట్టింది. ఆలోచనా తరంగాల్లో డోలలూగుతూ గదిలో బొమ్మలు అలంకరించుకోటానికి లోనికి వెళ్లాను. ఇంతలో నే యెవరో పాడిదగ్గు దగ్గినట్టు వినబడింది.

అతనెప్పుడూ నా వద్దకు రాలేదు. అందువలన నాకు ఆశ్చర్యంతోపాటు రవ్వంత చింతకూడా కలిగింది. ఏమో పాపం! వాళ్లింటిలో యెవరికేనా జబ్బుగావుందో! లేక యెటువంటికష్టమైనా సంభవించిందో!! వరండాలోనికి వచ్చిచూశాను - మలినవస్త్రాలు ధరించిన బదలు సంకుచిత వదనంతో సగం విరిగిన బుట్ట నొకదానిని పట్టుకొని నిలబడ్డాడు.

నన్ను సమీపించి బుట్ట ముందరపెట్టి దానిమీద పరచిన మలినవస్త్రాన్ని తొలగించాడు; నేను ఆశ్చర్యపోయాను - తెల్లగాను, స్వర్ణమయవర్ణాల్తో చిత్రించబడిన సరస్వతీ ప్రతిమ నొకదానిని బదలు తీసికొనివచ్చాడు. ఆ ప్రతిమయొక్క శాంత గంభీర రేఖలకు పరిశుభ్రవస్త్రాలు, సువర్ణవర్ణపుకేశాలు, బంగరువీణ, సుదీర్ఘనాశిక, పొడుగుపాటికాళ్లు, తెల్లనివెన్నెల విరజిమ్మే సుందర చిఱునగవు యెంతో అందం సమకూర్చుతున్నాయి. "శిరోకేశాలను ఒక్కొక్కటిగా స్పష్టంగా అగుపించేలా చిత్రించిన ఆ శిల్పస్రష్టయెవరు" అని అడిగాను. అతడొసంగే ప్రత్యుత్తరంకోసరం నేనెదురుచూడలేదుకాని సును సిగ్గుతెరలను కనులకుకప్పి తన శల్యహస్తాలను ముందుకుసాచి చెప్పాడు ... వీటితోనే తయారుచేశానని! విశ్వాసం కుదరక ప్రతిమవంక బదలువంక అనుమానపుటద్దాలతో చూస్తుండిపోయాను. సంవత్సరం పూర్వం అందాల పాత్రలను రూపొందించటానికి తన అశక్తతను వెలిబుచ్చిన కుంభకారుడేనా? "నీవు కుగ్రామపు కుమ్మరివి. నాజూకు పాత్రలు చేయటం అసంభవం అని భావించే నీవు యిటువంటి ప్రతిమను చిత్రించేకల్పన యెలా చేయగలిగావు?" అన్న మాటలు అప్రయత్నంగా నా నోటినుండి వెలువడినాయి.

నెమ్మదిగా ఆలోచించినమీదట సత్యం స్పష్టపడింది. సరస్వతీ ప్రతిమ చూడడంతో కళాకారుడవ్వాలనే కాంక్ష బదలూ మదిలో కదలికలాడింది. తన సర్వ శక్తుల్ని ధారవోసి చిత్రగత సౌందర్యాన్ని తన మట్టి బొమ్మల్లో ప్రతిబింబింపజేసే ప్రబలయత్నాలెన్నో చేశాడు. అనేకసార్లు విఫలుడయ్యాడు. కాని విరామమెరుగని నిరంతరకృషివల్ల నాకు బహుమానంగా సమర్పించటానికి అర్హతగల సరస్వతీ ప్రతిమను సృష్టించగల్గాడు.

ఆ నాటినుండి యెన్నో దీపావళులు దేదీప్యమానంగా వెలిగిపోయాయి. బదలూ యెన్నో సౌందర్యప్రతిమలను సృష్టించాడు. అవి అనేక సంపన్న గృహాల నలంకరించాయి.

బహుశా తన పతిని శ్రేష్ఠకళాకారునిగా రూపొందించేందుకే కాబోలు రధియా జీవించింది. కళాకాంతుల్లేని మట్టికుండల స్థానాన్ని సౌందర్య ప్రతిమలు అధిష్టించగనే తన మమతను జతగాదీసికొని యే అజ్ఞాత లోకాలకో మహాప్రస్థానం సాగించింది.

రధియా పునరాగమనం కోసరం కాబోలు బదలు ప్రభాతాన్నుండి ప్రదోషకాలంవరకు, సంధ్యనుండి ఉషస్సువరకు ప్రతీక్షిస్తాడు.

ప్రతీక్షలో ఉదాశీనతవుంది. కాని ఒక జీవిత మానవుడు మృతునికోసరం ప్రతీక్షా ప్రయత్నంసాగిస్తే అతను గగనకుసుమాలను వాంఛించటమే అవుతుంది. అలాంటివాళ్లనుచూస్తే నిజంగా కరుణకురుస్తుంది. మిధ్యావాది రధియా ఆ అమాయక గ్రామీణ కుంభకారుని జీవితంలో యెంతటి మహత్తర స్థానాన్ని అధిష్టించింది! ద్వితీయ వివాహాలకు కుతూహలపడే శిలాహృదయుల శిరస్సుపై చావుదెబ్బ కొట్టింది.

స్త్రీ యొక్క మాతృత్వమే సత్యం! వాత్సల్యమే శివం!! మమతయే సుందరం!!! ఈ మహత్తర శక్తులతో ఆమె పురుషుని జీవితంలో ఉత్కృష్ట స్థానాన్ని అధిష్టించినపుడు ఆమెలేని స్థానాన్ని ఆక్రమించటం అసంభవం.

తుదకు పదమూడు వత్సరాల దుఃఖియా తన చిన్ని కొంగునీడన తన తండ్రికి తోబుట్టువులకు శాంతి ప్రసాదించింది. రధియా ప్రతిరూపాన్ని ధరించి ఆమెలా తాను శోషించుతూ అందరినీ పోషించుతూంది.

రెండు సంవత్సరాలక్రితం అతని కళాకౌశల్యానికి ముగ్ధుడై బదలు మామ సోదరుడొకాయన అతనిని పిల్లలతోపాటు ఫైజాబాద్ తీసికెళ్ళాడు. కాని దీపావళికి యేదేని ఒక ప్రతిమ తీసికొనిరావటం అతడు మరచిపోడు. కాని యీ సంవత్సరమే నియమోల్లంఘన జరిగింది. దీపావళి వచ్చింది - వెళ్లింది. కాని యింతవరకు ప్రతిమతీసికొని బదలురాలేదు. బహుశా రధియాను అన్వేషిస్తూ వెళ్లియుంటాడు...? ఐనా మా యింటిలో ప్రతిష్ఠింపబడిన బుద్ధుడు, కృష్ణుడు, సరస్వతి, బాపు మొదలైన మూర్తులు, పురాతనసాకలైపై ఒత్తి మట్టి ముద్దలను తయారుచేసే గ్రామీణ కుమ్మరిని స్మరణకుతెస్తూ "కళ నీ బాబు సొమ్ము గాదు! కల్పన నీ క్రీత దాసీగాదు!!" అంటున్నట్లు వుంటుంది.

---

# మనస్తత్వం

'కుమారి'



"నీలాంటి తెలివితక్కువదాన్ని పెండ్లి చేసికుంటానని నేను కలలోకూడ అనుకో లేదు. మీ తల్లిదండ్రులు, చుట్టాలు నిన్ను ఏకంగా వర్ణించి నాకు కట్టబెట్టారు. నీవు నా గృహలక్ష్మివని అందరూ అంటారు కాని నీలో నాకలాంటి లక్షణాలు ఏమి కనుపించుటలేదు. బుద్ధియున్నవాళ్లు ఒక్కసారి చెప్పితే గ్రహిస్తారు. నీ బోటిదానికి ఎన్ని చెప్పితే మాత్రం లాభముఏముంది! నీతోబాటు నా యింటికి కళకాంతులు వస్తవనుకున్నాను. సుఖసౌభాగ్యాలతో నన్నుద్ధరిస్తావని అనుకున్నాను. కాని నా ఖర్మం నీలాంటి మందమతిని పెళ్లాంగా సమకూర్చింది" అని గ్రుక్క తిప్పుకో కుండా ఆశాలత భర్త కసిరాడు.

ఆశాలతకు తన భర్త వైఖరి ఏమిఅర్థము కాలేదు. కారణములేకుండా ఆయన తన్నెందుకు దూషించాడో అగోచరమయంగానున్నది. భార్య అంటే తన చేతిలోని కీలుబొమ్మగా భావిస్తున్నట్లని పించింది. స్కూలుఫైనలుదాక చదువు కొనిన ఆశాలత భర్త వైఖరిని సహించ లేక ప్రతీకారానికి దారి వెదకింది. స్త్రీల బానిసత్వాన్ని రూపుమాపాలని పలు మారుపన్యాసాలిచ్చిన తానే బానిసనయి పోయానని బాధపడింది. భర్త అన్న ప్రతిమాట చెవులలో ముళ్లతో పొడిచి నట్లుండింది. ఇష్టంలేని పెండ్లి అతడెందుకు చేసికోవాలి? తన్నెందుకు బాధపెట్టాలి? ఆశాలత సహించలేకపోయింది. అంతు లేని ఆవేశంతో "నన్ను పెండ్లిచేసికోమని నేను మీ కాళ్లు పట్టుకోని ఏనాడూ ప్రాధేయపడలేదే! మీరు నన్ను పెండ్లి చేసికొనకుండాయుంటే నాకువచ్చియుండే లోటేమి యుండేదికాదు. హాయిగా శ్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో బ్రతికేదానిని. ఇప్పటిలాగ ఊడిగపు చాకిరిచేస్తూ మీచేత నీచాతి నీచమైన మాటలు తినకుండానైనా తప్పిపోయేది" అన్నది.

ఆమె ముఖం కందగడ్డలాగ ఎర్రబడింది. కండ్లు నీళ్లతో నిండినవి ఆవేశంతో ఒళ్లు తెలియకుండా గజగజలాడిపోతున్నది.

భార్య ఎదురు మాటలకు రాజుకు అరి కాలిమంట తలకెక్కింది. ఆమెను నమలి మ్రింగేద్దామన్నంత కోపము వచ్చింది. కాలు కాలిన పిల్లిలాగ "నోర్మూసు - నీవు నన్నుద్ధరించలేకపోగా నన్ను, నా సంసారాన్ని నాశనంచేయ ఏర్పడ్డట్టున్నావు. నీలాంటిదియున్నా ఒకటే లేకున్నా ఒకటే.

ఆడదానివైపుట్టి నీ సౌభాగ్యాన్ని, నీ సంసారపు మంచి చెడ్డలను అర్థంచేసికొని నడచుకొనలేకున్నావు'' అని చరచర ఎక్కడికో వెళ్ళిపోయాడు.

ఆశాలత కళ్లలో నీళ్లు గిర్రున తిరిగాయి. మంచముమీద పండుకొని దిండుమీద ముఖంపెట్టి భోరున ఏడువసాగింది. తన జీవితం తారుమారయిందని యూహించసాగింది. తన్నెంతో ప్రేమానురాగాలతో చూస్తూయున్న భర్త యిప్పుడు యింత నిర్దయగా, ఏహ్యంగా చూడడానికి, హింసించడానికి కారణము ఏమిటో అర్థముకాక తికమకపడసాగింది.

♦ ♦ ♦

ఆశాలతకు, రాజుకు వివాహమయి రెండు సంవత్సరాలయింది. కాపురానికి వచ్చినప్పటినుండి వాళ్లిద్దరు అన్యోన్యంగా నుంటుండేవారు. రాజు కోర్టునుండి వచ్చేసరికి ఆశాలత చక్కగా ముస్తాబయి కళకళలాడుతూ యింట్లోని వస్తువులు ఎక్కడి వక్కడ సర్ది ఎదురు చూస్తున్నట్లుగా నుండేది. రాజు యింటికిరాగానే తన శ్రమనంతా మరచిపోయేవాడు.

సంవత్సరము గడిచిన తరువాత ఆశాలతలో వచ్చినమార్పు రాజుకు చీకాకు కలిగించింది. ఆమె ఎందుకో పది రోజులనుండి బద్ధకంగా నుంటున్నది. సకాలానికి తలదువ్వుకోడంగాని, అన్నం తినడం కాని, మునుపటిలాగ యిల్లు సర్దడంకాని కనుపించదు. రాజు కోర్టునుండి వచ్చేసరికి ఏమూలనో చాపవేసికొని పడుకొని యుండేది. ఎక్కడిగుడ్డలక్కడ, ఎక్కడి వస్తువులక్కడ చిందర వందరగా నుండేవి. మునుపు తానింటికి రాగానే ఎంతో ఉత్సాహంగా కళాకాంతులతో కనుపించే ఆశాలత, యిలాగ మారిపోవడమునకు కారణము ఏమిటో యూహకందడము లేదు. ఆమెను స్వయంగా అనేకసార్లు అడిగాడుకాని ఏమిలేనట్లుగా మౌనము వహించి తప్పించుకునేది.

ఆశాలత అయినా మునుపటిలాగుండాలని ఎంతగానో ప్రయత్నించేది. లేని ఓపికను, శక్తిని తెచ్చుకోవాలని ప్రయత్నం చేసేది. కాని రోజులు గడిచేకొద్దీ నీరసం, అశ్రద్ధ ఎక్కువ కాసాగినవి. రాజుకు ఆందోళన అధికమయింది. ఆమె అలాగుండటానికి తనేమైనా కారణమేమోనని మధనపడసాగాడు. ఏదో మనసులో నుంచుకొని తన్ను వేధిస్తున్నదని గట్టిగా కసరడం కంటె చేయకలిగింది కనుపించలేదు.

తనలోవచ్చిన మార్పును ఆశాలత గ్రహించినా దానికి కారణమును భర్తకు చెప్పుటకు సిగ్గుపడింది. కాని అంతమాత్రంచేత భర్త తన్ను తూలనాడటం

న్యాయంకాదని ఆమె మనసు ఘోషించింది.

డాక్టరు సుందరమూర్తిగారి కుమార్తె ఆశాలత. లేకలేక కలిగిన సంతానమగుట చేత ఎంతో గారాబంగా పెంచి విద్యాబుద్ధులు చెప్పించారు. ఆశాలత మంచి తెలివితేటలుకలది. మంచి వాగ్ధాటి కలిగి అనర్గళంగా చదువుకునే రోజుల్లో ఉపన్యాసాలిచ్చేది. స్త్రీల స్వాతంత్ర్యోద్యమమన్నా, మహిళాభ్యుదయమన్నా ఎంతో ఆసక్తి కనబరచేది. సాధ్యమైనంత వరకు స్త్రీ ఉద్యోగం చేయాలి. తర్వాతనే వివాహంచేసికోవాలి. అప్పుడుగాని పురుషునితోబాటు సమాన గౌరవ మర్యాదలతో జీవయాత్ర సాగించడాని కవకాశముండదని గంటాపథంగా ఉపన్యాసాలిచ్చేది.

ఆమె ఉపన్యాసాలను విన్నవారు ముగ్ధులయ్యేవారు. తల్లిదండ్రులు సయితం తమ కుమార్తె అభిప్రాయాలను గమనించి సాధ్యమైనంత త్వరగా పెండ్లిచేయడం మంచిదని స్కూలుఫైనలుకాగానే సుందరమూర్తిగారు ఆశాలతకు సంబంధాలను వెతకనారంభించారు.

ఆశాలత మాత్రం తన కింతలో వివాహం జరుగనున్నదనుకోలేదు. ఎప్పటియట్లు బ్యాంట్మింటన్ ఆడుకొని యింటికి వచ్చి ముఖము కడుక్కొంటుండంగా పనిమనిషివచ్చి "అమ్మగారూ! పెళ్ళివారు వచ్చారు - రేపోమాపో మీ పెళ్ళి" అని ముసిముసి నవ్వులు నవ్వింది.

ఆశాలత మండిపడి "నాన్సెన్స్" అని గద్దించి యింట్లోకి వెళ్లింది.

తల్లి పట్టుచీర, జాకెట్టు తెచ్చియిచ్చి సింగారించ పూనుకునేసరికి ఆశాలత గుండెల్లో గుర్రాలు పరుగెత్తసాగినవి. అప్రయత్నంగా ఆమె కండ్లవెంట జలజల నీరుకారినవి. బలవంతంగా ఆమెను ముస్తాబుచేయాల్సివచ్చింది.

ప్రక్క గదిలో సుందరమూర్తిగారు పెండ్లికొడుకుతో "రాజూ! అమ్మాయికి పెళ్ళిచేసి అచ్చటా, ముచ్చటా చూడాలనియుంది. ఇక నీ దే ఆలస్యం" అంటున్న మాటలు లీలగా వినబడుతున్నవి.

ఆశాలతను పెళ్లివాళ్లు చూడడానికి గదివదలి బయటికిరమ్మని ఎంతబ్రతిమాలినా వచ్చిందికాదు. కాబోయే పెళ్ళికొడుకే స్వయంగావచ్చి చూడాల్సివచ్చింది ఆమెను.

ఏడ్చిఏడ్చి ఎర్రబడిన కళ్లతో, చెరిగిన తలతో నున్నప్పటికి ఆశాలత అందచందాలకు ముగ్ధుడయ్యాడు రాజు. పైగా చదువుకొన్న పిల్లను తన ఆశయం ప్రకారం వివాహం చేసికోపోతున్నానుకదాయని తృప్తిపడ్డాడు.

అక్కడినుండి వెళ్లబోతూ "ఆశాలతా దేవిగారూ! శలవు" అని చిరునవ్వుతో ఆమె కళ్ళలోకి చూచాడు.

"మహారాజుగా వెళ్ళండి! - మిమ్ములను రక్షిస్తున్నది ఎవరు!" అన్నది పెల్లుబికే దుఃఖావేశాలతో.

రాజు ఆశాలతను కట్నకానుకలు లేకుండా వివాహంమాడ సమ్మతించాడు. రాజుకు 20 యకరాల మాగాణిభూమి, యిల్లు, వాకిలి యున్నవి. పైగా వకీలు వృత్తి; సుందరమూర్తికి సయితం సంబంధము అన్ని విధాల నచ్చింది.

ఆశాలతకు మాత్రం తానింత త్వరగా పెండ్లి చేసికోడం యిష్టంలేదు. తల్లిదండ్రులకు నచ్చచెప్పాలని ఎంతో ప్రయత్నం చేసిందికాని లాభంలేకపోయింది. తల్లిదండ్రుల మాటకు ఎదురు తిరిగితే లోకులు తానొక్కగా నొక్కబిడ్డ ఎదురుతిరిగిందని అంటారనే అపనిందకు భయపడింది. ఎలాగైతేనేం వైభవంగా వివాహం జరిగింది.

రాజు ఆశాలతను ప్రేమదేవతగా ఆరాధించాడు. ఆమె అతనిని అనుసరించి, వారిద్దరి అనురాగ దాంపత్యాన్ని చూచి తల్లిదండ్రులు భగవంతునికి కృతజ్ఞతను వెల్లడించారు. ఇంటబయటకూడ వారి ఆదర్శదాంపత్యమునుచూచి ముచ్చటపడేవారు.

♦ ♦ ♦

రాజు ఏకాంతముగా ఒక పార్కులో కూర్చొనియున్నాడు. తన తొందరపాటుకు పశ్చాత్తాపపడ్డాడు. కాని కారణం తెలియకుండా ఆశాలత అలాగ క్రుంగి కృశించిపోతుంటే తనెంతకాలమని ఉదాసీనంగా నుండగలడు? తానడిగితే చెప్పదాయె! ఏదో ఉన్నట్లేయుండి ఆలోచన తట్టింది. లేచి నేరుగా లేడీ డాక్టరు యింటికివెళ్ళి టాక్సీలో ఆమెను యింటికి తీసికొనివెళ్లాడు.

డాక్టరు ఆశాలతను పరీక్షచేసి గదిలోనుండి బయటికివచ్చి హాలులో కూర్చుంటూ "రాజుగారూ! మీకు కొడుకో, కూతురో పుట్టబోతున్నది" అన్నది నవ్వుతూ.

రాజు, ఆశాలత ఒకరి ముఖం ఒకరు చూచుకొని తలలు వంచుకున్నారు. డాక్టరు వెళ్లిపోయిన తరువాత రాజు భార్యను సమీపించి "ఆశా! యీ విషయమని నాకెందు కిదివరకు చెప్పకపోయావు! నీవు రోజు రోజుకు నీరసించిపోతుంటే నేనేమని అనుకోవాలిచెప్పు! - చూడు ఆశా! చీకాకులో నిన్ను కసిరాను - క్షమించవూ!" అన్నాడు.

"చాలులెండి - నోటికివచ్చినట్లుతిట్టడం మీవంతే, క్షమించమనికోరడం మీవంతే - ఆడవాళ్లంటే మీ దృష్టిలో అంత తేలికగానున్నారు" అన్నది ఆశాలత.

# ఈశావాస్యోపనిషదు

పూజ్యపాద శ్రీ స్వామీ చిన్మయానందజీ

ఉపనిషదులు

(గతసంచిక తరువాయి)

వాయురనిలమమృతమథేదం భస్మాన్తం శరీరమ్ ।
ఓం క్రతో స్మర కృతం స్మర క్రతో స్మర కృతం స్మర ॥ ౧౭ ॥

నా యొక్క ప్రాణము వాయువుతో లయమగును గాక, ఈ దేహము అగ్నిచే, భస్మమగునుగాక. ఓం ఓమనసా ! నా కార్యములను తలచుకొనుము. తలచుకొనుము. ఓ మనసా ! నా కార్యములను తలచుకొనుము నా కార్యములను తలచుకొనుము.

పరిపూర్ణ అపరోక్షానుభూతివలన ధ్యానకాలమునందు, అహంకార జీవుడు, సత్యపరమాత్మను అనుభవించగలిగి, "నేనే ఆతడు. నీయందుండు పురుషుడు" అని తెలుసుకొనిన పురుషుడు, తన మరణకాలమున ఎట్టి స్థితిలో నుండును. అహంకారము పరమాత్మ పూర్ణ ఎరుకయందు లయమగునపుడు, తన యొక్క శరీర ప్రాణ, మానసిక, విజ్ఞాన కోశముల పైపు ఎట్టి అభిప్రాయమును కలిగియుండును, ఇట్టి ప్రశ్నల కన్నిటికి ఈ శ్లోకమునందు ఋషి ఉత్తరమిచ్చియున్నాడు.

ఆత్మ సాక్షాత్కారము పొందిన పురుషుడు, జీవితము అందుగల చంచల పరిణామములను ఎదుర్కొనునట్లే, మృత్యువునుకూడా సంతోషముతో ఎదుర్కొనగలుగుచున్నాడు. అటుపిమ్మట అతనికి మరణమునది యొక సంకట మార్పుగా తోచక, ఆనంద ప్రాప్తి నొసగగల అమర జీవిత ప్రారంభముగా నుండును. అతని కోరికంతయు తన ప్రాణము. ఈ సర్వ వ్యాపియగు వాయువునందు లయము పొందవలెను. మనసును గూర్చి అతడు, "నీవు పూర్వము చేసిన కార్యములన్నియు జ్ఞప్తికి "తెచ్చుకొనుము" అని చెప్పుచున్నాడు.

వాస్తవముగా, ఆత్మ సాక్షాత్కారము పొందిన పరమ పురుషుడు అట్టి అవస్థలో తలచగల విషయమంతయు, తాను తన తీక్ష్ణధ్యాన కాలమునందు పరమాత్మానుభవము పొందిన విషయమొక్కటియే జ్ఞప్తికి తెచ్చుకొనగలడు. మన జ్ఞాపక శక్తియంతయు మన తీవ్ర అనుభవములో మాత్రము తలచగలిగియున్నది. ఇచ్చట ఋషి "ఓ మనసా, జ్ఞప్తికి తెచ్చుకొనుము" అనుటలో, మరణకాలమునందుకూడ, మనసు ఇతర తలంపుల జోలికి పోకుండునుగాక అని భావము. కనుక మనముకూడ మానవజీవిత సాఫల్యమునకై, అట్టి నిరంతర అనుభవము స్థిరత్వమును పొందియుండును గాక !.

అగ్నే నయ సుపథా రాయే అస్మాన్విశ్వాని దేవ వయునాని విద్వాన్ ।
యుయోధ్యస్మజ్జుహురాణమేనో భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ ॥

ఓ అగ్ని ! సర్వకాలములందును, నీవు తెలిసిన మంచిమార్గమున మమ్ములను నడిపించి సంపదనొడగూర్చుము. పాపముల యందలి వక్ర మోహమును మా నుండి తొలగించుము. నీకు మా యొక్క పూర్ణ నమస్కారములు సమర్పించుచున్నాము.

ఉపనిషదునందలి ఈ కడపటి శ్లోకమున, ఆత్మ సాక్షాత్కారము పొందిన, పురుషుడు తన మరణకాలమున తన ఇష్టదేవతను ప్రార్థించి, గమ్యస్థానమునకు చక్కని మార్గముల గొంపోవలెనని కోరునట్లు ఆదేశించుచున్నారు. ఇట్లు పరిపూర్ణ స్థితి పొందిన మహా

నీయుని వాక్యాన, తన ఇష్ట దేవతా స్వరూపునకు ఒక వినయపూర్వక ప్రార్థన కలిగించుచున్నారు ఇందు వల్ల ఉపనిషదు కర్తలు, సాధకులకు, సాధన కాలమున, సాధన సామగ్రిలో ముఖ్యమైనదిగా యొక ఇష్టదేవతా ఉపాసన యుండవలెను. అట్టి ఇష్టదేవత యందు నిసంశయ, తీక్ష్ణ, నిరంతర భక్తి చూపుట ఆవశ్యకమని, సూచించుచున్నారు.

చక్కని వేదాంతము తనకు శత్రువు కాదని భక్తులు తెలుసుకొనవలసియున్నది. వేదాంతులు, భక్తి మార్గమును ఖండించుట, వేదాంతమున తమకుగల ఉన్నత నమ్మకమునకు అవమానము కలిగించుననియు తెలుసుకొనవలెను. వేద కాలమున అగ్ని యొక దేవతా స్వరూపముగా నుండెను. ఇచ్చట ఈ ప్రార్థనవల్ల, అగ్నిదేవుని స్తోత్రము చేయబడుచున్నది.

ఈ శ్లోకమున, అగ్నిదేవుడు స్తోత్రము చేయబడి, మనలోను సంపదపొందునట్లు వేడుకొనబడుచున్నాడు. ప్రకృతి విషయవాదులు, ఇచ్చట సంపద యనగా, స్వర్ణరూప ధనమని పొరబడకూడదు. అర్థశాస్త్రజ్ఞుల ధనమునుగూర్చి ఇచ్చట ప్రసంగము జరుగుటలేదు. ఇచ్చట దైవీ సాధకుల సంపత్తును గురించి ఋషులు తలచుచున్నారు. కనుక సంపద అనగా ఇచ్చట ఆనందము, ముక్తి, లేక సౌందర్యము అని అర్థము. సాధకుడు మరణశయ్యనుండి కోరగల కోరిక, పరిపూర్ణ మోక్ష పదవి యొకటియే.

శ్లోకమునందలి మిగిలిన భావములు స్వప్రకటితముగా నున్నవి.

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణా
త్పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణమాదాయ, పూర్ణమే
వావ శిష్యతే ॥
ఓం శాన్తిః శాన్తిః శాన్తిః
ఓం తత్సత్.

## "కళాభారతి" నృత్యపాఠశాల
### వార్షికోత్సవము

జూలై 15న దక్షిణ భారత హిందీ ప్రచారసభ కళా మండపమునందు, మద్రాసు పురప్రముఖుల సమక్షంలో శ్రీ రమణారావు, శ్రీమతి సామ్రాజ్యం గార్లచే నిర్వహింపబడుతూన్న "కళాభారతి" వార్షికోత్సవం జయప్రదంగా జరిగింది. ప్రొఫెసరు సాంబమూర్తి, శ్రీ ఇ. కృష్ణయ్యరు, శ్రీ గోపీనాధ్, శ్రీ మోటూరి సత్యనారాయణగార్లు సభకు హాజరైన వారిలో ముఖ్యులు. శ్రీమతి కె. లక్ష్మీరఘురామ్ సభకు అధ్యక్షత వహించారు. శ్రీ సాంబమూర్తి, శ్రీ కృష్ణయ్యరు కళాభారతి దర్శకులైన శ్రీ రమణరావు, శ్రీమతి సామ్రాజ్యం గార్లను అభినందించుతూ భారత ప్రభుత్వంవారి ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో "కళాభారతి" వంటి నృత్య పాఠశాలకు ఇతోధిక సహాయం లభించగలదని ఆశిస్తున్నామని చెప్పారు.

కళాభారతి సేవ దిన దిన ప్రవర్ధమానం కావాలని నటనా కళానిధి శ్రీ గోపీనాధ్ ఆశీర్వదించారు.

శ్రీ మోటూరి సత్యనారాయణగారు కళాభారతి నృత్యపాఠశాలకు కావలసిన వసతిసౌకర్యాలన్నీ హిందీ ప్రచారసభలో తాము ఎల్లప్పుడూ సమకూర్చ గలమనీ మద్రాసు పౌరులు కళాభారతికి తగిన ధన సహాయం చేయడమే కాకుండా, తమ బిడ్డలను, తమ స్నేహితుల బిడ్డలను దానిలో చేర్చి ప్రోత్సహించవలసిందనీ కోరారు.

శ్రీ రమణరావు సభికులకు స్వాగతమిస్తూ కళాభారతి గత సంవత్సరపు చరిత్రను తెలియజేసి, కళాభిమానులైన పురప్రముఖుల సహకారం, భారత ప్రభుత్వ సహాయం లేనిదే ఇటువంటి పాఠశాలలను నిర్వహించడం కష్టమనీ, ప్రజలూ ప్రభుత్వమూ తమకు సహాయం చేయగలరని ఆశిస్తున్నామనీ అన్నారు.

సభకు అధ్యక్షత వహించిన శ్రీమతి లక్ష్మీరఘురాంగారు కళాభారతి భారతీయ నృత్యకళా వైభవాన్ని ప్రపంచమంతట విస్తరింపచేయగల నర్తకీ నర్తకులను తయారుచేయవలెనని ఆశీర్వదించారు.

ఈలపాట కే. రఘురామయ్యగారి సంగీతంతో ఉత్సవ కార్యక్రమము ప్రారంభమయినది. పాఠశాల విద్యార్థినులు ముఖ్యంగా కుమారి సత్యశీల నృత్యము ప్రేక్షకుల సానంద పరవశులను చేసినది.

# బంగారు తిమ్మరాజు కథ

శ్రీ ఏకుమల్ల కామేశ్వరరావు

—(०)—

(గతసంచిక తరువాయి)

జంగంకథలో తిమ్మరాజు మరణించినట్లుగా ఉంది. కాని ఇది చరిత్రకు వ్యతిరేకం. సింహాసనాసీనుడైన తన తమ్ముడితో తిరుమలరాజు అనేక యుద్ధాలు చేస్తూన్నట్లుగానే ఉంది. చారిత్రక సత్యాన్ని జంగంకథా కవి ఆదరించక జంగంకథల సంప్రదాయాన్ని మాత్రమె అనుసరించేడు. చివరకు పూలరంగారావు అనగా రంగరాయలు రాజ్యానికి వచ్చినట్లు జంగంకథా కవికూడ చెప్పేడు. ఎక్కువ చిక్కులు లేకుండ సింహాసనాన్ని పొందడం బట్టి ఇతనికి పూలరంగరావు అను పేరును కవి ఏర్పరిచేడు. 'పూలరంగడు' అను తెలుగు జాతీయానికి మూలం ఇదేనా?

రంగరాయలు రాజ్యానికి 1614 నాటికిగాని రాలేదు. అయినా రాజ్యంలోని ముఖ్య విషయాలు కొన్ని వదంతులుగా వ్యాపించడంవల్ల రంగరాయల పేరు ఈ పాటలో చేరి ఉండవచ్చు. జంగంకథా కాలం క్రీ. శ. 15 ప్రాంతమని చెప్పవచ్చు.

ఈ జంగంకథ ఇటీవలి రచనకాదని చెప్పడానికి మాత్రం బలమైన నిదర్శనముంది. చంద్రశేఖర శతకంలో తిమ్మరాజు (బంగారు తిమ్మరాజు) కథా ప్రశంస ఇట్లుంది. ఈ శతకం గ్రామ్య భాషలో రచించబడింది.

ఇంటిని తిమ్మరాజుకత, యింటిని
  యార్లకథా ప్రసంగముల్
ఇంటిని పాదులాలి, యిబమింటిని
  నాయకురా శ్శా్రమె
ప్పంటికి నందివాక్కుమల పొందు
  చరిత్రన నాకు భాగ్యమె
ప్పంటికి గల్గునోయను నవజ్ఞుడు
  మూర్ఖుడు చంద్రశేఖరా!

ప. 38.

## చంద్రశేఖర శతక కాలం

బంగారు తిమ్మరాజు కథా కాలానికి ఈ శతక మెట్లు సాయపడుతుందో చూద్దాం.

తిమ్మరాజు కథా రచనా కాలంకూడ ఈ శతకంలో చెప్పబడినట్లుగా తోస్తూంది. ఈ రకం జానపదకథలు మేలయినవి కావు అని చంద్రశేఖర శతక కర్త అభిప్రాయం.

చందము, రుత్తలచ్చనము జాతులు,
  వీరతి, శక్రమాల్లు లా
సందులు దోసమచ్చు లోడసారమునూసి
  కయియాసునైతి యిం
పొందగ తిమ్మరాజుకథ పూర్ణముగా
  వచనంబు సేస్తి, యి
ట్లందరు సెప్ప నేరరని యందురు
  మూర్ఖులు చంద్రశేఖరా!

ప. 36.

("వచనము" అంటె ఇక్కడ రచన అని మాత్రమె అర్థం.)

చంద్రశేఖర శతకకవి కాలం క్రీ. శ. 1700

[6] J. A. H. R. S. Vol. 18. P. 191.

అయియుండవచ్చు అని ప్రతాపరెడ్డిగారి [7] అభిప్రాయం. బంగారు తిమ్మరాజు జంగంకథా కాలం 1592 ప్రాంతం కాబట్టి చంద్రశేఖర శతక రచనకూడ క్రీ. శ. 1592 ప్రాంతమే అవుతుంది.

ఈ శతకంలోని 'శిపాయి' అను మాటను చూస్తే, ఇది తూర్పు ఇండియా వర్తక సంఘంవారు దేశీయసైనికులను అనగా సిపాయిలను యుద్ధాలలో విరివిగా ఉపయోగిస్తూన్న కాలంలో రచించబడిందా అనే అనుమానం కలగవచ్చు. కాని శిపాయి అనేది హిందుస్థానీ పదం. కాబట్టి కాలనిర్ణయానికి అడ్డు రావడంలేదు. ఈ కవి 'మాడ' అను నాణెము పేరు ఉపయోగించేడు. అతని కాలంలో మాడలు చెలామణిలో ఉండేవని ఊహించవచ్చు. బంగారు తిమ్మరాజుకథ పాతదే అని చెప్పడానికి మరొక ఆధారముంది. పైన చెప్పిన తంజావూరి భాండాగారంలో 'బంగారు తిమ్మరాజుకథ' అను తాటాకు పుస్తకముందికదా! ఇది వచనం. దీనిని గురించి కాటలాగులో ఇట్లు వ్రాసినారు.

“ప్రారంభం - వ. తురుకతోప పైదినములనెడు దేశము పెనగొంట బాధక పన్నెండు జనములనెడు పాళిము ప్పెనకొంట, భూమికి ముద్ర పెట్టెంటయ్యా నాయులు పెనకొంటలో రాయలు దేవడు కమ్మ రాయ మన్యుడుడు శుక్రవారమునాడే, రాజా కోలు వున కూచుంట ... నవమినాడు తండ్రి ముఖమున తప్పక చూచె బంగారు తిమ్మరాజు. (సశేషము)

---

[7] సురవరం ప్రతాపరెడ్డిగారి 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' అను గ్రంథం. పుట 399.

[8] ఈ శతక కర్తృత్వాన్ని గురించి మరి కొంత చర్చించవచ్చు. ఈ శతక కవిపేరు చంద్రశేఖరుడా లేక ఆ పేరుగల దేవుణ్ణి మాత్రమే సంబోధిస్తు ఈ శతకాన్ని రచించేడా?

ద్విపద కావ్యాలను రచించిన చంద్రశేఖరులు ముగ్గురున్నారు. 1. ఉత్తర హరిశ్చంద్ర చరిత్రను వ్రాసిన గద్దె. చంద్రశేఖరకవి. ఇతను సానగగోత్రంవాడు. 2. భామ కల్యాణాన్ని రచించిన చంద్రశేఖర కవి. ఇతను కంసాలి. 3. హరిశ్చంద్ర చరిత్రను వ్రాసిన వెన్నెలకంటి చంద్రశేఖరకవి. ఇతను బ్రాహ్మడు, 1700 ప్రాంతంవాడు. (చూ. నిడదవోలు వెంకటరావుగారి ద్విపద వాఙ్మయ సూచిక.) కాలభేదాన్ని బట్టి వెన్నెలకంటి చంద్రశేఖరకవి ఈ శతక కర్తకాదు. ఈ శతక కర్త బ్రాహ్మడు కాబట్టి మొదట చెప్ప బడిన ఇద్దరి కవులలో ఒకడుకాదని చెప్పవచ్చు.

ఈ శతకంలో వాడపల్లి నరసింహుని తీర్థం చేరువను (పద్యం 76) ఉందని చెప్పబడింది. కృష్ణానదీ తీరాన అమరావతివద్ద ఒక వాడపల్లీ, రాజమహేంద్రవరానికి ఎదురుగా గోదావరి అవతలి గట్టున ఒక వాడ పల్లి ఉన్నాయి. ఇట్లే ఇతర వాడపల్లులుకూడ ఉన్నాయి. ఈ శతకంలో 80.వ పద్యంలో కూడలి చించి నావలని ఒక స్థలం చెప్పబడింది. పడమటి గోదావరి జిల్లాలో నరసాపురం తాలూకాలో చించినాడ అను గ్రామం గోదావరి డెల్టాలో ఉంది. కాని పేర్లు వేరుగా ఉండబట్టి ఇది కాదు. ఇట్లుండగా చంద్రశేఖర స్వామి అను దేవుడిపేరును గూర్చికూడ కొంత చర్చించవచ్చు. గుంటూరి జిల్లాలో తుంగభద్ర, కృష్ణానది కలిసేచోట కూడలివిజాగర్లమూడి (క. రామకృష్ణ శాస్త్రిగారి వీరశైవాంధ్ర వాఙ్మయం, పుట 317) లోని దేవుడుకి చంద్రశేఖరుడను పేరుకూడ ఉంది. ఈ విధంగా ఒక మేలుకొలుపులో (కొండపల్లి వీరవెంకయ్య గారు అచ్చువేసిన మేలుకొలుపులు) స్తుతించబడ్డాడు. కాబట్టి ఈ స్థలాన్ని గురించికూడ ఆలోచించవచ్చు. ఏదయినా పెనుగొండకు సమీపమందుండే స్థలంలోనివాడే ఈ చంద్రశేఖర శతక కర్త అని ఊహించవచ్చు. లేకుంటె అతను బంగారు తిమ్మరాజుకథనుగూర్చి అంతగా విమర్శించ నవసరంలేదు.




పునర్నవం (గేయాలు): శ్రీ దాశరథి. ప్రచురణకర్తలు: దేశోద్ధారక గ్రంథమాల, హైదరాబాద్ (దక్కన్) వెల సభ్యులకు రు. 1-3-6 ; యితరులకు రు. 1 6-0.

ఇందలి గేయములు భావయుక్తంగా రసపుష్టి కలిగియున్నవి. గ్రంథకర్త అపూర్వ అనుభవ విశేషాలను దేశ కాల పాత్రాలకనుగుణ్యంగా తన అపార కవితా సంపదతో గేయ రూపంగా చిత్రించాడు.

ఈ గేయాలు పాఠకులలో విషాదం, ఉత్సాహం, ఉద్రేకం కలగిస్తూ పులకితుల చేస్తున్నవి.

ప్రజల మనిషి (తెలంగాణా నవల): శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి. ప్రచురణ కర్తలు: దేశోద్ధారక గ్రంథమాల, నారాయణగూడ, హైదరాబాద్. వెల సభ్యులకు రు. 2-3-0 యితరులకు రు. 2-8 0.

ఈనాటి స్వతంత్రభారత వాతావరణమునకు ఆనాటి తెలంగాణా ప్రజలుపడిన బాధలకు గల తారతమ్యమును వివరించడానికిగాను యీ నవలలో సృష్టించబడిన పాత్రలు, సంఘటనలు పొందికగా నున్నవి. రైతులు, రైతు కూలీల కష్ట నిష్ఠూరాలనే వారినోట రచయిత చెప్పించి వాస్తవికతను చక్కగా పోషించాడు. సహజంగా నడిచిన యీ నవలా రచన తెలుగు సాహిత్యంలో ఉత్తమ స్థానము నలంకరించినదనే చెప్పాలి.

శ్రీరామచంద్ర స్తవమంజరి (రామాయణ సంగ్రహము): శ్రీ కోట సోదర కవులు ప్రతులకు 'కవిచంద్ర గ్రంథమాల', కనిగిరి (నెల్లూరు జిల్లా) లేక 18 వరదా ముత్తియప్పన్ వీధి మద్రాసు-1 వెల 0-8-0.

ఇది సుమారు 20 పుటల చిన్న పుస్తకము. కవిచంద్రులు కోట సోదర కవులు పద్యకావ్యంగా రామాయణమును యింత చిన్న పుస్తకంలో రచించ పూనడం సాహసమని చెప్పాలి. శ్రీరామచంద్రుని స్మరించి స్తోత్రము చేయుటనుద్దేశించిన దగుటచే సామాన్య ప్రజానీకం సయితం యీ పుస్తకంపట్ల ఆసక్తి చూపవచ్చును.

# సంపాదకీయములు

## వ్యభిచార నేరములు

వ్యభిచార నేరములకు స్త్రీ పురుషు లిద్దరు శిక్షార్హులనేవాదం ముమ్మాటికి బలీయమైనదనే చెప్పాలి. కాని వ్యభిచారము నరికట్టడానికి తగిన వాతావరణమును సృష్టించి విస్తృతం చేయడంలో ప్రభుత్వము, ప్రజలు గురుతరమైన బాధ్యతలను విస్మరించరాదు.

వ్యభిచార నేరములకుగల ముఖ్య కారణములలో నైతికంగా దిగజారడం ఒకటి. మరొకటి ఆర్థిక దుస్థితి. ఇంకా బాధ్యతా రహితంగా విలాసజీవితము నుద్దేశించడం, యువతీ యువకులలో విద్యార్థి దశయందు విద్యా విజ్ఞానాలపట్ల దృష్టి కేంద్రీకరించుట కనువైన విద్యా విధాన లోపము, వివాహ సందర్భమున యువతీ యువకులకు తమ వైవాహిక జీవితమును రూపొందించుకోడానికి తగినంత స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లేకపోవడం సయితము మరికొన్ని కారణాలు.

ప్రజలలో నైతిక స్థాయి ఉన్నంతకాలం స్త్రీ పురుషుల జీవితాలు క్రమ బద్ధంగానే యుండగలవు. తల్లిదండ్రులు తమ బిడ్డల వివాహ సందర్భమున వారి శ్రేయోభివృద్ధులపట్ల బాధ్యత వహించవలసినవారయినా యుక్తాయుక్త పరిజ్ఞానంతో యువతీయువకులు తమ జీవిత భాగస్వాముల నెన్నుకొనుటను వారి తల్లిదండ్రులు ప్రోత్సహించిన నాడు వ్యభిచారము కొంత అరికట్టబడవచ్చును.

వివాహము చేసికొనగోరు వితంతువులకు తగిన సంబంధాలనుచూచి వివాహం చేయుడం మంచిది. పూర్వాచారములను, మూఢ నమ్మకాలను దృష్టిలో నుంచుకొని వివాహితులు కాగోరు వారిని ఆటంక పరచడంవలన వారి నైతిక స్థాయి దిగజారుడుకు దోహదం చేసినవారగుదురు.

సంఘ జీవితంలో ఆర్థిక దుస్థితి వ్యభిచారమును అధికంగా ప్రోత్సహిస్తుండటము గమనించవలసిన విషయము. సోమరితనానికి అవకాశము లేకుండా గౌరవనీయమయిన బ్రతుకుతెరువుండి, జీవితావసరాలకు లోటు లేనప్పుడు వ్యభిచార నేరములు తగ్గగలవు.

విద్యార్థి దశలో యువకుల మనస్తత్వము విద్యావిజ్ఞానాల ఆర్జన నుద్దేశించిన విద్యావిధానము అవసరము. విద్యార్థులకు తదితర ప్రాపంచక విషయములతో "అనవసర ఆసక్తి, బాధ్యతలు లేకున్నచో ఉన్నతమయిన నైతిక స్థాయి అలవడగులదు.

విలాస జీవితమున కలవాటుపడి వ్యభిచారులగు స్త్రీ పురుషులను మందలించి అవసరమయితే శిక్షించి నలుగురితోబాటు మాన మర్యాదలతో, గౌరవంగా జీవయాత్ర సాగించడానికి సంఘము, ప్రభుత్వము కూడ ప్రోత్సహించాలి.

పడుపువృత్తి మూలంగా కుటుంబ జీవితంలో సౌభాగ్యము నశించును. ఆరోగ్యము చెడును. స్పర్థలు, కక్షలు పెరిగి సుఖశాంతులు తగ్గును.

వ్యభిచారము నరికట్టుటకుగాను వాస్తవిక పరిస్థితుల దృష్ట్యా పూనుకున్నచో సంఘ శ్రేయస్సు విశేషముగా పదిలము కాగలదు.



# శ్రీ దుర్ముఖినామ సం॥ర శ్రావణ - భాద్రపదమాసములు

| | | | |
|---|---|---|---|
| ఆగస్టు నెల 1956 సం॥ | 16 | గు | ద 5-32 జ్యే 7.41 |
| | 17 | శు | ఏ 9.4 మూ 12.48 వరలక్ష్మీవ్రతం |
| | 18 | శ | ద్వా 13-12 పూషా 18-27 త్యా 4-24 గురుమాధ్వారంభం |
| | 19 | ఆ | త్ర 17.39 ఉషా 24-25 త్యా 4.24 |
| | 20 | సో | చతు 22.8 శ్ర 30.24 ఋగ్వేదీనాం ప్రాచీనోపకర్మ |
| | 21 | మం | ○ 26.24 ధ 36 9 యజుర్వేదీనాం ప్రాచీనోపకర్మ |
| | 22 | బు | కృపా 30.12 శ 41.23 త్యా 4.18 |
| | 23 | గు | వి 33-17 పూభా 45.53 |
| | 24 | శు | తృ 35.22 ఉభా 49.24 త్యా 4.14 |
| | 25 | శ | చ 36.21 రే 51.50 త్యా 4.10 |
| | 26 | ఆ | పం 36-6 అశ్వ 53.15 |
| | 27 | సో | ష 34.37 భ 52.58 త్యా 4.0 |
| | 28 | మం | స 37-54 కృ 51.41 స్మార్త, మాధ్వ శ్రీకృష్ణ జన్మాష్టమి |
| | 29 | బు | అ 28.3 రో 49.19 త్యా 3.51 వైష్ణవ శ్రీకృష్ణ జన్మాష్టమి |
| | 30 | గు | న 23.17 మృ 46.7 త్యా 3.47 |
| | 31 | శు | ద 17-36 ఆర్ద్ర 42-1 |
| సెప్టెంబరు నెల 1956 సం॥ | 1 | శ | ఏ 11.25 పున 37.34 |
| | 2 | ఆ | ద్వా 4-56 ఏష్యం 53-23 పున 32-56 త్యాజ్యాభావః |
| | 3 | సో | చతు 51.24 ఆశ్లే 28-26 త్యా 3-44 మాసశివరాత్రి |
| | 4 | మం | ● అమా 46.2 మఖ 24.17 త్యా 3-46 |
| | | | **భా ద్ర ప ద మా స ము** |
| | 5 | బు | శుపా 40.54 పూఫ 20-45 |
| | 6 | గు | వి 36.40 ఉఫ 18-4 త్యా 3.54 |
| | 7 | శు | తృ 33.35 హ 16-26 త్యా 3.58 షోడశగౌరీవ్రతం |
| | 8 | శ | చ 31-39 చి 15.55 త్యా 4.3 వినాయకచతుర్థి |
| | 9 | ఆ | పం 30-59 స్వా 16-38 |
| | 10 | సో | ష 31.30 విశా 18.33 |
| | 11 | మం | స 33.13 అనూ 20.38 |
| | 12 | బు | అ 35-47 జ్యే 25-44 త్యా 4.20 దూర్వాష్టమి |
| | 13 | గు | న 39.31 మూ 30.40 |
| | 14 | శు | ద 43-42 పూషా 36-14 |
| | 15 | శ | ఏ 48 15 ఉషా 42.9 |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.



దయాల్బాగ్ మహిళా శిక్షణ కళాశాలకు చెందిన సీనియర్ పటాలం తాలూకు బాలికలు 300 గ్రామాలలో సాంఘికసేవయందు పాల్గొని గ్రామీణ మహిళలకు విద్య, పారిశుధ్యం, అల్లిక, కుట్టుపనులను నేర్పుచున్నప్పటి దృశ్యము